## నిత్య జీవితంలో

# గురు-శుక్రుల ప్రభావము

(యోగ / ఫలిత - శాంతులు)

రచన

మేడవరపు సంపత్ కుమార్

ఎం.ఎ (సంస్కృతం)





# నిత్య జీవితంలో గురు-శుక్రుల ప్రభావము


రచన

**మేడవరపు సంపత్ కుమార్** ఎం.ఎ. (సంస్కృతం)

4-399, తారకరామనగర్,

విశ్వామిత్ర బిల్డింగ్స్, నర్సింహా రోడ్,

జగన్నాథపురం, కాకినాడ-2

ఫోన్ 2341878, 98493 54393



మొదటి ముద్రణ జనవరి, 2004

ముద్రణ స్వామి ఆఫ్‌సెట్ ప్రింటర్స్, VJA-3

డి.టి.పి

శ్రీ గ్రాఫిక్స్, విజయవాడ-3 ఫోన్ 98486 72030

ప్రచురణ

ఋషి ప్రచురణలు

మెయిన్ రోడ్, హనుమాన్‌పేట,

విజయవాడ - 520 003

ఫోన్ 0866 - 2579190

వెల **రూ. 20-00**






శ్రీం

శ్రీ మహాగణాధిపతయే నమః

శ్రీరస్తు　　శుభమస్తు　　అవిఘ్నమస్తు

శ్లో॥ మహాకవి ముఖాంభోజ మణిపంజర శారికాం ।
చైతన్య జలధిజ్యోత్స్నాం దేవీం వందే సరస్వతీమ్ ॥

## గురుగ్రహ స్తుతి

శ్లో ॥ దేవానాంచఋషీణాంచ గురుకాంచన సన్నిభం ।
బుద్ధిమంతం త్రిలోకేశం తంనమామి బృహస్పతిమ్ ॥

★ వేదమంత్రం- బృహస్పతే పరిదీయా రథేనా రక్షోహా
మిత్రా అపబాధమానః । ప్రభంజన్
సేనాః ప్రమృణోయుధాజ యన్నస్మాక
మేధ్య వితారథానామ్ ॥　　ఋగ్వేదం 10-103-4

సామవేదం 2-12, అధర్వవేదం 19-3-8, వాజసనేయ సంహిత 17-36, తైత్తరీయ సంహిత, మైత్రాయణీయ సంహిత, కారక సంహిత, తైత్తరీయ బ్రాహ్మణములలో నున్నది బృహస్పతి గ్రహ మంత్రద్రష్ట అప్రతిరధుడు, ఇంద్రుని కుమారుడు, ఇది త్రిష్టుప్ చందస్సు

ఇది ఋగ్వేదులు జపించు మంత్రము యజుర్వేదులు జపించు బృహస్పతి గ్రహమంత్రము వాజసనేయ సంహిత 26, 3 నందు కలదు

★ "బృహస్పతే అతి యదర్యో అర్హాద్
ద్యుమ ద్విభాతి క్రతుమజ్జనేషు ।
యదీదయచ్ఛవస ఋత ప్రజాత
తదస్మాసు ద్రవిణం ధేహి చిత్రమ్॥

ఇది ఋగ్వేదము నందు కూడా 2-23-15 కలదు దీనికి ఋషి గృత్సమదుడు

ఇది త్రిష్టుప్ చందస్సు ఇది సూక్తములో 15వ ఋక్ మంత్రము మొదటి ఋక్ "గణానాం త్వాగణపతిం హవామహే" అనునది ఇది బ్రహ్మణస్పతి సూక్తం ఈ బ్రహ్మణస్పతి, బృహస్పతిగా, యాస్కుడు నిరుక్తంలో పేర్కొన్నాడు

అధర్వవేదులు జపించు బృహస్పతి మంత్రం

★ బృహస్పతిర్నః పరిపాతు పశ్చాత్
ఉతోత్త రస్మాదధారాద ధాయోః ।
ఇంద్రః పురస్తాదుత మధ్యతోనః
సం వాసఖిభ్యో వరివః కృణోతు ॥

## గురుని గూర్చి పురాణ గాధలు

గురున్కి, బృహస్పతి, జీవ, ఆంగిరసుడు, సురా చార్యుడు అను పేరులు కలవు అంగిరసుని కుమారుడు ఉతధ్యుడు, సంవర్తనుడు, గురుని సోదరులు గురుని భార్య తార కుమారుడు శంయుడు

శివ పురాణ రీత్యా, ఒకనాడు బృహస్పతియు, ఇంద్రుడు ముని వేషధారులై శివుని చూచుటకు కైలాసమునకు వెళ్లుచుండగా శివుడు వీరిని పరీక్షించుటకు, ఉగ్రరూపమును ధరించి, దిగంబరుడై వీరికి అడ్డుగా నిలిచెను ఇంద్రుడు అతడు శివుడని తెలియ లేక వజ్రాయుధము ధరించెను వెంటనే శివుని క్రోధ నేత్ర దృష్టికి ఇంద్రుడు భస్మమయ్యెను అపుడు ఈ దిగంబరుడే శివుడని బృహస్పతి గ్రహించి స్తోత్రము చేసి, ఇంద్రుని బ్రతికింపుమని ప్రార్థించెను ఇంద్రుడు పనర్జీవితుడయ్యెను ఆనాటి నుండి గురునకు 'జీవ' అను పేరు కల్గెను

మహా భారత రీత్యా – బృహస్పతి తన సోదరుడైన ఉతధ్యుని భార్య మమతను కామించి ఒకనాడు బలాత్కరించెను అప్పటికామె గర్భవతిగా నున్నది గర్భస్థ శిశువు కూడా బృహస్పతిని నిందించెను బృహస్పతికి కోపగించి ఆ శిశువును అంధునిగా పుట్టమని శపించెను బృహస్పతి మమతయందు విడిచిన వీర్యమును ఆ శిశువు బయటకు త్రోసెను ఆ విధముగా బయటకు వచ్చిన గురు వీర్యమును (ఉద్వాజమైన వీర్యము) నీవు భరింపుము, నీవు భరింపుము అని గురుడు, మమత తగవులాడిరి చివరకు ఇద్దరూ గ్రహింబక విడచిపెట్టిరి ఆ వీర్యమునుండి పుట్టిన నాడే భరద్వాజుడు (ధ్వాజంభర, ధ్వాజంభర ఇతి భరద్వాజః)

భాగవతం – 4వ అధ్యాయ రీత్యా, బ్రహ్మటేకుమారుడైన అంగిరస మహర్షికి వసుద (శ్రద్ధ) అనే భార్య కలదు ఈమెకు 8 మంది కుమారులు, 1కుమార్తె కుమారులు 1 – ఉతుధ్యుడు 2 – బృహస్పతి (గురుడు) 3 – సంవర్తుడు, 4 – శాంత, 5 – ఘోర, 6 – విరూపుడు, 7 – వయస్యుడు, 8 – సుధన్వుడు కుమార్తె పేరు ఆంగిరసి ఈమె అష్టవసువులలో ఒకటైన ప్రభాసుని వివాహమాడినది మహాశిల్పి "విశ్వకర్మ" వీరి కుమారుడే

"స్కాంద పురాణ" రీత్యా ! బృహస్పతి ప్రభాస క్షేత్రంలో, శివుని గూర్చి 100 సం॥లు తపస్సు చేసి, ఆయనను మెప్పించి, నవగ్రహములలో గ్రహత్వమును వరముగా పొందినాడు

భాగవత రీత్యా – గురుని భార్య తార చంద్రుని కామించెను చంద్రుడు తారను తీసుకుపోయెను వీరిరువురికి బుధుడు జన్మించెను తారను గూర్చి గురుడు ఇంద్రాదులతో మొర పెట్టుకొనగా, రాక్షసులు చంద్రుని పక్షము వహించి దేవతలతో యుద్ధమునకు దిగిరి అపుడు గురుని తండ్రి అంగిరసుడు బ్రహ్మతో తీర్పు చెప్పి వివాదము తీర్చమనకోరగా బ్రహ్మ తారను అడిగి బుధుని చంద్రునకు ఇప్పించెను

భాగవతములోని ఈ కథకు – ఋగ్వేదం 10వ మండలం 8 – 109 సూక్తం ఆధారం అందు, ఇదే కథ వున్నది బృహస్పతి భార్య అయిన జుహు (వాక్కు)ను, చంద్రుడు అపహరించగా దేవతలు వరుణుడు – వాయువు – ఆదిత్యుడు ఇంద్రుడు, సప్త ఋషులు తిరిగి జుహును, బృహస్పతికి ఇప్పిస్తారు

"సోమోరాజా ప్రధమో బ్రహ్మజాయం
పునః ప్రాయచ్ఛ దహృణీయ మానః ।
అన్వర్తితా వరుణో మిత్ర ఆసీత్
అగ్నిర్హోతా హస్త గృహ్యానినాయ ॥

అగ్ని హోత్రుడు స్వయముగా ఆమె చేతిని, బృహస్పతికి అప్పగించి మధ్యవర్తిగా శుభత్వం చేసినాడని ఋగ్వేదంలో ఉన్నది

మత్స్యపురాణ రీత్యా – రాక్షసులకు గురువైన శుక్రుడు, తన భార్య అయిన జయంతితో, సంగమమందుండగా, రాక్షసులను మోసగించుటకు ఇదే సమయమని భావించి గురుడు శుక్రుని రూపము ధరించి, వారి వద్దకు వెళ్లెను రాక్షసులు ఇది తెలుసుకొనలేకపోయిరి ఇంతలో శుక్రుడు వచ్చెను ఇద్దరు ఒకేలాగ ఉండుటచూచి రాక్షసులు ఆశ్చర్యపడిరి కొంతసేపు ఇరువురూ నేనంటే నేను అని వివాదించిరి అనంతరం గురుడు అంతర్ధానమై వెళ్లిపోయెను

## గురు నక్షత్రములు

గురుదశ 16 సం॥లు ఈ దశలో జ్ఞానము – విద్య, మంత్రోపదేశములు, కుటుంబము – ధన వృద్ధి – కుమారులు, మనుమలు, అభివృద్ధి – ఉన్నత పదవులు – కీర్తి ప్రతిష్టలు కలుగును ఈ క్రింది నక్షత్రములలో జన్మించిన వారికి పుట్టినపుడు గురుదశ ప్రారంభమగును

1 – పునర్వసు – ఇది ధనుస్సాకారములో నుండు 5 నక్షత్రముల సమూహము దీని అధి దేవత అదితి- ఇది వైశ్యజాతికి చెందినది పురుష – జలతత్వం – తూర్పు దిక్కు – దేవగణం – యోని పిల్లి – ఆదినాడి ఇది 3 పాదములు మిధునరాశి, 4వ పాదము కర్కాటకరాశి ఇందు జన్మించినవారు విశ్వాసపాత్రులు, దయగలవారు

2 – విశాఖ – ఇది తోరణాకారంలో ఉండే 4 నక్షత్రముల సమూహం దీని అధి దేవత ఇంద్రాగ్నులు ఇది చంలుల జాతికి చెందినది స్త్రీ లింగం తేజోతత్వం నైఋతి దిశ, రాక్షసగణం,

యోని పులి, అత్యనాడి, 3 పాదములు తులారాశి 4వ పాదం వృశ్చికం ఇందు జన్మించినవారు అసూయాపరులు తేజోవంతులు ధనసంపాదనలో నిపుణులు, సూక్ష్మబుద్ధి

3 - పూర్వాభాద్ర - ఇది మంచం ఆకారంలో ఉన్న 2 నక్షత్రముల కూడిక దీని అధి దేవత అజైకపాద్ ఇది బ్రాహ్మణ జాతికి చెందినది పురుష లింగం ఆకాశతత్వం ఎడమతొడ, నారికేళవృక్షం మనుష్య గణం - యోని సింహం ఆదినాడి - 3 పాదములు కుంభరాశి, 4వ పాదము మీనరాశి ఇందు జన్మించినవారు నిపుణులు - ఆచారమీనులు - క్రూరులు విజయము పొందువారు అగుదురు

## శరీరంలో గురుని ఆధిపత్యం

జీర్ణకోశము - మెదడు - కొవ్వు - గుండెకు రక్తం సరఫరా చేయు అర్టెరీలు - చెవులు, వినికిడి శక్తి - కామెర్లు వ్యాధికి కారకుడు - చర్మము - సిస్టిస్, చూపుడు వ్రేలు

## గురుగ్రహం

గురుడు దేవతలకు గురువు బంగారు కమలము పై కూర్చుండి, తెలుపు - పసుపు వర్ణ మిశ్రమము కలిగిన దేహకాంతితో ప్రకాశించుచూ, పచ్చని ఆభరణములు ధరించి, జపమాలా, కమండల, దండములు 3 హస్తములలో ధరించి, 4వ హస్తముతో వరద ముద్రుడై, మనోజ్ఞుడై గురుడు వెలుగొందుచుండును

## గురుగ్రహరాశులు

1 ధనుస్సురాశి - ఇది శీర్షోదయరాశి బంగారు రంగు, రాత్రి బలం కలది పురుషరాశి - సత్వ గుణం ఇందు జన్మించినవారు ఆశావాదులు దృఢమైన శరీరం కలవారు ఉష్ణగుణం పైత్యతత్వం, కోలముఖం అల్ప సంతానం అల్ప స్త్రీ సుఖం అగ్నిరాశి, క్రోధము కలవాడు, శుచి, మేధావి, ధనవంతుడు, తక్కువ ఖర్చు పెట్టువాడు అగును

2 మీనరాశి - ఇది శీర్ష పృష్టోదయరాశి నీల వర్ణం రాత్రిబలం కలది స్త్రీ రాశి బ్రాహ్మణ జాతి జలగుణం ఇందు జన్మించినవారు, సొమ్ములు, ధనవంతులు, అధిక సంతానవంతులు, వేగముగా నడచువారు, క్రోధవంతులు, పరిశుభ్రతలేనివారు, పని యందు ఇష్టము కలవారు అగుదురు

## గురునకు ఉచ్ఛ - నీచలు

గురుడు కర్కాటక రాశిలో 5 డిగ్రీల భాగలలో పరమోచ్ఛ మకరంలో 5 డిగ్రీలలో పరమనీచ ధనుస్సులు 10డిగ్రీలు మూలత్రికోణం

గురుడు 5-7-9 స్థానములను చూచును

## గుర్వుగ్రహ కారకత్వములు

శ్లో॥ భూదేవస్స్వ గురు స్వకర్మ రథగో పాదనిక్షేపకా
మీమాంసో నిధి వాజి మాహీష బృహద్దాత ప్రతాపాయశః ।
తర్కజ్యోతిష పుత్ర పౌత్ర జరర వ్యాధి ద్విపాత్సంపదో
వేదాంత ప్రపితామహాది పురుష ప్రాసాది గోమేధికాః ॥

ఉత్తర కలామృతం – 40

శ్లో॥ జ్యేష్ఠ భ్రాతృ పితామహేంద్ర శిశిరరూ గ్రాణిరత్నాంవణి
గ్దేహా రోగ్య విచిత్ర హర్మ్యనృపసన్మానోరు దేవాస్తవః ।
దానం ధర్మ పరోపకార సమధృక్ చోవంగ్ముఖో వర్తులం
పీతంగ్రామ చరోత్తర ప్రియ సఖాందోళాది వగ్ధోరణీః ॥

శ్లో॥ మేదే మద్య పటౌ నవీన గృహసౌఖ్యం వృద్ధ మంత్రద్విజాః
తీర్థంజాను సువర్ణలోక సరణం సౌఖ్యం ప్రధానం గృహం ।
ధీః ప్రజాధిక ధాన్య గోపుర సభా సన్మోద సింహాసనః
బ్రహ్మాస్థాపన సార్వకాల బలమాసాః పాత్ర వైఢూర్యకౌ ॥

శ్లో॥ అగ్నిష్టోమ మహాఫలం మధుర సస్పత్వం సుఖం సౌఖ్యకే
దీర్ఘం సౌమ్య పరేంగితేచ కనకాలంకార తంత్రాదిశః ।
వాతశ్లేష్మసు పుష్య రాగ నిగమా భాసామృదుప్రస్తరం
శైవో పాసన చేష్టికత్వ చతురంతాఖ్య ప్రయాణం గురోః ॥

తా॥ గురుడు తన అనుగ్రహంచేత తన అధీనయులో నున్న వీటన్నిటిని ఇచ్చును పెద్ద శరీరయు, లావు పెరుగుట మీ మాంసాశాస్త్రము । బ్రాహ్మణత్వము – కర్మ – అజీర్ణవ్యాధి – ఉదరము – నిధి – విశేష బంధువులు – ఇంద్రుడు – కీర్తి – ప్రతాపము – తర్కము – జ్యోతిష శాస్త్రము – కుమారుడు – మనుమలు – మునిమనుమలు – వేదాంతము – తాత – ముత్తాత – భవనములు – సత్యగుణం – దేవతా భక్తి – పెద్దలు – అందరినీ సమముగా చూచు సమదృష్టి – ఉత్తర దిక్కుయందు ప్రేమ – పల్లకీ ప్రయాణము – మేధస్సు – మద్యము – మెకాలు – నూతన గృహము – మంత్రోపదేశములు బ్రాహ్మణస్నేహం – స్వర్గ లోక గమనం – ప్రజ్ఞా కావ్యము – గోపురం – సభ – మంత్రి పదవులు – ఆనందము – సింహాసనం – బ్రహ్మాస్థాపన – ప్రతిష్ఠ చేయుట – వైఢూర్యములు – శిశిర ఋతువు అన్నగారు – గోమేధికము – యజ్ఞములు – తపస్సు – తియ్యని పదార్ధములు – పసుపు రంగు – దీర్ఘ చతురస్రం – ఇతరుల మనసులోని భావములు గ్రహించు శక్తి – బంగారము – ఆభరణములు – వేదములు – తంత్ర శాస్త్రం వాత – శ్లేష్మములు – పుష్యరాగము – మెత్తటి పక్క – ఈశ్వరోపాసన – ఆచారము – ఉన్నత వాహనములపై ప్రయాణము మొ॥

గుణములు గురుని వల్ల జాతకుడు పొందును

## గురుదశా ఫలితములు

శ్లో॥ జీవోత్కృష్ట దశాకరోతి విపుల గ్రామాధికారాత్మజా
శ్రీ సౌభాగ్య గుణాకరాశ్రిత జనాశ్వందోళికా వైభవాన్ ।
జైవ్యాపాపద శామహీర్వర భమాధీ వ్యాధి ధైర్యచ్యుతా
ధాన్యానర మహీసురార్తి జనక క్రోధాశనార్తి క్షయాన్ ॥

తా॥ గురుడు 1-4-7-10 కేంద్రస్థానములందు, ఉచ్చ - స్వక్షేత్ర - వర్గోత్తమ స్థానములందున్నపుడు, తనదశలో ఈ శుభ ఫలితముల నిచ్చును ఉన్నత పదవులు - సద్గుణములు - కుమారులు - ధనవృద్ధి - తనవారికి మేలు చేయుట - వాహన యోగములు - వైభవం - కీర్తి మొ॥ శుభఫలితముల నిచ్చును

గురుని పాప దశలో, మనోవ్యాధి, రోగము - బ్రాహ్మణ శాపము - ధాన్య నష్టం - గృహనష్టం - సోమరిగా కూర్చుని పిత్రార్జితము ఖర్చు చేయడం - తండ్రితో శత్రుత్వము - ఆహారము లేక పోవుట - క్షయ రోగము - మొ॥ చెడు ఫలితముల నిచ్చును

## గురుగ్రహ లక్షణములు

గురుడు బ్రాహ్మణ జాతి గ్రహం - సత్వగుణం - పురుష గ్రహం - బంగారు వర్ణం కలవాడు - మంత్రి - గురువారము - పుష్యరాగము - పసుపు రంగు - బ్రాహ్మణులకు అధిపతి - పెద్ద శరీరము వాడు - గోధుమ రంగు - కేశములు నేత్రములు కలవాడు - పొడగరి, విశాల రక్షస్థలము రలవాడు - శ్లేష్మతత్వం - ఆకాశ తత్త్వం - శ్రవణేంద్రియం - తీపి ఇష్టము - చల్లని పానీయములు - ఋజుదృష్టి కలవాడు పగలు బలవంతుడు - సామాన్య దుస్తులు ధరించువాడు - జీవకారకుడు - శనగలయందిష్టము - వేదాంత శ్రవణమునందిష్టము అధిదేవత - బ్రహ్మ, ప్రత్యధి దేవత - ఇంద్రుడు

గురునకు - రవి, చంద్ర, కుజులు మిత్రులు శుక్ర, శని, బుధులు శత్రువులు

## 12 స్థానములలో గురు గ్రహ ఫలితములు

1 గురుడు లగ్నమందున్న జాతకుడు సుఖవంతుడు దేవతార్చనా తత్పరుడు, ధనవంతుడు, మంచి వాగ్వైభవము కలవాడు, పుత్రవంతుడు, చిరంజీవి అగును యవనాచార్యుల రీత్యా లగ్న గురుడు స్త్రీలకు సౌందర్యమును, సద్బుద్ధిని ఇచ్చును

2 లగ్నము నుండి 2వ స్థానములో గురుడున్న జాతకుడు, భవిష్యజ్ఞానము కలవాడు, 16 సం॥ నుంచీ ధనము సంపాదించువాడు అగును ఇట్టి గురుడు పాపగ్రహ సంబంధము పొందిన విద్యా విఘ్నములు, అబద్ధములాడుట మొ॥ లక్షణములు కలవాడు నీచ, వక్రత్వము కలిగినచో, మత్తుపానీయములు సేవించువాడు, భ్రష్టుడు అగును పరస్త్రీ సాంగత్యము, కుటుంబ విరోధము కలుగును

3 లగ్నము నుండి 3వ స్థానములో గురుడున్నచో జాతకుడు లోభి, సోదరవర్గము కలవాడు, బహు తెలివితేటల కలవాడు, దీర్ఘాయువు, బంధు విరోధి, 38 సం॥ యాత్రలు చేయుట, మో॥ ఫలితము పొందును

4 లగ్నము నుండి 4వ స్థానములో గురుడున్నచో, జాతకుడు సుఖ జీవితము పొందువాడు, సత్ప్రవర్తన కలవాడు, భూస్వామి, మేధావి అగును పాపగ్రహసంబంధము చేత మాతృ సుఖములేనివాడు, బంధుద్వేషి అగును

5 లగ్నము నుండి 5వ స్థానములో గురుడున్నచో, విశాలమైన నేత్రములు కలవాడు వైభవము కలవాడు, అన్నదానము చేయువాడు, కుటుంబ ప్రేమ కలవాడు, 18వ సం॥ము మంచి ఉద్యోగము పొందువాడు, మంచి యోగ్యులయిన పుత్రసంతతి పొందువాడు, మంచి వక్త అగును గురుడు కర్కాటక, కుంభ రాశులలో నుండి ఇది పంచమమైన సంతతి కలుగదు ధనుస్సు పంచమమై అందు గురుడున్న ఆలస్యముగా సంతతి కలుగును కర్కాటక గురుని వలన స్త్రీ సంతానము అధికము పంచమమున గురుడొక్కడే యున్న "సుతపంచకదో గురుః" అని, 5 గురు కుమారుల నిచ్చును

6 లగ్నము నుండి 6వ స్థానములో, గురుడున్న శత్రువులను జయించువాడు, కుటుంబ వృద్ధి కలిగి మనుమల కలుగువాడు, రోగములేనివాడు, కీర్తి ప్రియుడు, అగును

7 లగ్నము నుంచి 7వ స్థానములో గురుడున్న విద్యావంతుడు, బహు లాభములు పొందువాడు, విద్యావతి అయిన భార్యను పొందువాడు, భార్యామూలమున ధన లబ్ధిపొందువాడు, రాజకీయముగా యోగమును పొందువాడు, రాజ భోగములు అనుభవించువాడు, ధీశాలి, ఏక పత్నీవంతుడు అగును

8 లగ్నమునుండి 8వ స్థానములో గురుడున్న, నీచకృత్యములు చేయువాడు, అల్పాయువు, శుభులతో కలసిన దీర్ఘాయువు, 17వ సం॥ విధవాస్త్రీ సంగమము పొందువాడు, శుభుడైనచో వేదశాస్త్రములు తెలిసినవాడు యోగి అగును

9 లగ్నము నుండి 9వ స్థానములో గురుడున్న, మత సంప్రదాయములు పాటించువాడు, దానశీలి, సాధుప్రవృత్తి, 35 సం॥ యాగము చేయువాడు తండ్రి దీర్ఘాయువుగా గలవాడు, ప్రతిష్టలు చేయువాడు, అనేక మందిని పోషించువాడు తపస్సు చేయువాడు అగును పరాశరుడు –

**"సర్వ సంపత్ సమృద్ధంచ నవమే రాజసంపదమ్"**

**తా॥ అనేక సంపదలు, రాజకీయముగా రాణింపు పొందువాడు అగును.**

10 లగ్నము నుండి 10వ స్థానములో గురుడున్న, ధార్మికుడు, అనేక గంధ విజ్ఞాని, బహు సమర్థుడు, సత్కీర్తి పొందువాడు, భావాధిపతి బలవంతుడయిన, యాగాది శుభ కర్మలు చేయువాడు, జ్యోతిష పండితుడు, గ్రంధ రచయిత, రాజ భోగములు అనుభవించువాడు అగును

పాప గ్రహ సంబంధమున్న ఉద్యోగ భంగము, దురాచారము కలుగును ఉదాహరణ – 1 బి వి రామన్, ప్రపంచ ప్రఖ్యాత జ్యోతిషవేత్త, జననం 1912–8–8 రాత్రి 7 42 ని॥లు, వృషభరాశి, కుంభలగ్నం




ఈ జాతకములో దశమ గురుడు, గురు - చంద్రుల గజకేసరి యోగం (4-10) విశేష యోగదాయకము జ్యోతిష శాస్త్రంలో ఈ గురుడు విశేష ప్రతిభ, కీర్తి, ధనవృద్ధి, గ్రంధ రచనా వైదుష్యం తన దశలో ఇచ్చాడు 1937-6-11 నుంచి 1953-6-11 వరకు గురుదశ జరిగినది శని దృష్టి గురునిపై పడినందువలన గురుడు కొన్ని అశుభ ఫలితాలనిచ్చాడు పీఠికమీద యోగకారకుడయ్యాడు శని దశ విశేషంగా యోగించింతి గురుడు తన అనుగ్రహము చేత అనేక సన్మానములు, విదేశములలో డాక్టరేట్లు, కీర్తి ప్రతిష్టలు, ఉన్నత సంతానమును ఇచ్చాడు

11 లగ్నము నుండి 11వ స్థానములో గురుడున్న, జాతకుడు విద్యావంతుడు, ధనికుడు, 32వ సం॥ వాహనయోగము, చంద్రునితో కలసిన విశేష భాగ్యవృద్ధి, చంచల మనస్కుడు, మంత్రవేత్త, స్వల్ప పుత్రవంతుడు అగును

12. లగ్నము నుండి 12వ స్థానములో గురుడున్న, జాతకుడు దరిద్రుడు, చదువరి, స్వల్ప సంతానము కలవాడు, కేన్సర్ వ్యాధి పీడితుడు, అయోగ్యుడు అగును పాపగ్రహ సంబంధము వలన నాస్తికుడు, వ్యసనపరుడు, బంధు ద్వేషి, నీచుల సేవ చేయువాడు, రోగ బాధలు పొందువాడు అగును

శ్లో॥ **విద్వాన్ సువాక్యః కృపణః సుఖీచ**
**ధీమాన శత్రుః పితృతో ధికశ్చ!**
**నీచః తపస్వీ సధనః సలాభః**
**ఖలశ్చ జీతే క్రమశో విలగ్నాత్ ॥** బృహజ్జాతకం 20-7

తా॥ గురుడు లగ్నము మొదలు 12 స్థానములందు వివిధ ఫలితములు, వరాహమిహిరుడు ఇట్లు తెలిపెను లగ్నమున నున్న పండితుడు, 2లో నున్న మంచి మాటకారి, 3లో నున్న లోభి, 4లో సుఖవంతుడు, 6లో మేధావి, 6లో శత్రువులేనివాడు, 7లో తండ్రికంటే గొప్పవాడు, 8లో నీచకార్యములు చేయువాడు, 9లో తపస్వి, 10లో ధనవంతుడు, 11లో లాభము పొందువాడు, 12లో దుర్జనుడూ అగును

## గురుడు మేషాదిరాశులలో నున్న ఫలితములు

శ్లో॥ సేనానీ బహు విత్తదారతనయో దాతాసుభృత్యఃక్షమీ
తేజోదార గుణాన్విత స్సురగురౌ ఖ్యాతః పుమాన్ కౌజభే ।
కల్యాంగ స్ససుఖార్ధ మిత్ర తనయః త్యాగీ ప్రియశ్శౌక్రభే
బౌధే భూరి పరిచ్ఛ దాత్మజ సుహృత్సా చివ్యయుక్తస్సుఖీ ॥

బృహజ్జాపకం - 18 - 12

తా॥ గురుడు కుజక్షేత్రములయిన, మేష - వృశ్చిక రాశులయందున్న, మిలటరీ యందు ఉద్యోగము పొందువారు, ధన - కుటుంబ - పుత్రవంతులు, దాతలు, ప్రసిద్ధులు అగుదురు శుక్ర క్షేత్రములయిన, వృషభ, తులల యందు, గురుడున్నచో సుఖవంతుడు, ధనికుడు, సర్వజన ప్రియుడు అగును బుధక్షేత్రములగు మిధున, కన్యల యందు గురుడున్నచో పరివార, పుత్ర, మిత్రులు కలవాడు, మంత్రి పదవులు పొందువాడు అగును

శ్లో॥ చాంద్రేరత్న సుతస్వదార విభవ ప్రజ్ఞాసుఖైరన్వితః
సింహే స్యాద్భలనాయక సురగురౌ ప్రోక్తంచ యత్ చంద్రభే ।
స్వోర్కే మాండలికో నరేంద్ర సచివో సేనాపతిర్వాధనీ
కుంభే కర్కట వత్సలాని మకరే నీచో ల్ప విత్తఃసుఖీ ॥

తా॥ గురుడు, కర్కాటకములో, సింహరాశిలో ఉన్నపుడు ఈ ఫలితములనిచ్చును ధనము, మంచి భార్య, సంతానము, నవరత్నములు, సౌఖ్యము, మంచి ఉద్యోగము, వైభవము పొందును ధనుస్సు - మీనములందు గురుడున్నచో జాతకుడు ఉన్నతయైన వారి స్నేహాభిమానములు, ప్రభుత్వోద్యోగుల, మంత్రుల స్నేహము చేయును కంభమునందు గురుడున్న ధనికుడు, మేధావి, దీర్ఘాయువు, అందమైన భార్య కలవాడు, మేధావి అగును మకర మందు గురుడున్న, ఇది గురునికు నీచరాశి కావున జాతకుడు, స్వల్ప ధనవంతుడు, సుఖములేనివాడు, నీచకర్మలు చేయువాడు అగును

## గజకేసరి యోగం

ఈ యోగము గురుగ్రహం, చంద్రగ్రహం పరస్పర కేంద్రస్థితి వల్ల కలుగుతుంది ఈ యోగయు పట్టినవారికి దీర్ఘాయువు, ధనం, కీర్తి ప్రతిష్టలు కలుగుతాయి

శ్లో॥ గజకేసరి యోగోయం చంద్రకేంద్రే బృహస్పతిః
కేసరీ యోగ సంజాతో జీవేద్వర్ష శతంనరః ॥

గురుడు, చంద్రునికి 1-4-7-10 స్థానములందున్నచో ఈ యోగము పట్టును అయితే పాపగ్రహములు వీరితో సంబంధము కలిగియుండనిచో నూరుశాతం శుభ ఫలితములు జరుగును 6-8-12 స్థానాధిపతుల సంచంధముగాని, 6-8-12 స్థాదములందుగాని ఈ యోగము పట్టిన, కొద్ది శుభ ఫలితములే ఉండును ఇది ఒక గొప్ప యోగము మరణానంతరం కూడా కీర్తి నిలుస్తుంది

## గురుగ్రహ శుభఫలితములు పొందిన జాతకులు

**ఉదాహరణ 2 :** 'విశ్వకవి' రవీంద్రనాధరాగోర్ జననం 1861-5-7, ఉదయం 2-51 రేవతీ నక్షత్రం, మీనలగ్నం

| | | |
|---|---|---|
| (4) కు కే | ర శు బు | ల చ (1) |
| గు | రాశి | |
| శ (7) | | (10) రా |

మీన శభలగ్నం లగ్నాధిపతి గురుడు, పంచమస్థానంలో ఉచ్ఛస్థితి లగ్నాధిపతి, పంచమాధిపతుల పరివర్తన అంశలో గురుడు మీన స్వక్షేత్రం సంచమం బుద్ధి స్థానం కనుక, జాతకుడు గొప్ప బుద్ధి వైభవం పొంది గురుబలం చేత విశ్వకవి అయినాడు

గురుని శుభత్వం వలనే, కోలముఖం, ఋషి వంటి తేజస్సు, అధిక ధనవంతమైన కుటుంచంలో జననం అధిక సంతానం, గొప్ప పేరు ప్రతిష్టలు, ప్రపంబ ప్రఖ్యాతయైన 'నోబెల్ బహుమతి' లభించాయి రవిదశ గుర్వంతర్దశలో "శాంతినికేతన్" స్థాపించాడు 81 సం॥లు పరిపూర్ణ జీవితం గడిపాడు

**ఉదాహరణ 3 . అరవిందఘోష్ - యోగి - వేదాంతి**

**జననం 1872-8-15 ఉ 5-17**

| | | |
|---|---|---|
| రా | (10) | ల చ |
| (1) ల గు కు | రాశి | (7) |
| బు ర శు | (4) | కే చ శ |

కర్కాటక లగ్నం గురు - కుజుడు కలసియుండుటం వల్ల గొప్ప బలాన్ని పొందింది భారతదేశపు మొట్టమొదటి ఐ సి ఎస్ పట్టా పొంది స్వాతంత్ర్య సంగ్రామంలో అతివాద ధోరణి ప్రదర్శించారు లగ్న కుజునివల్ల ఈ ఉగ్రవాద మనస్తత్వం ఏర్పడింది అనంతరం గురుని ఉచ్ఛస్థితి వల్ల అంతర్ముఖుడై, తత్వాక శిఖరాలను అధిష్టించారు వాక్‌స్థానంలో బుధాదిత్య యోగంవల్ల గ్రీకు, లాటిన్, జర్మన్ ఇటాలియన్, ఫ్రెంచి, సంస్కృత భాషలలో ప్రావీణ్యం లభించింది ఋగ్వేదంలోని,

అగ్ని సూక్తములన్నీ పరిశోధించి "అగ్నిమంత్రమాల" అనే ప్రామాణికమైన మార్మిక వ్యాఖ్యతో ప్రచురించారు సావిత్రీ సత్యవంతుల కథను, ఇంగ్లీషులో "సావిత్రి" అనే కావ్యం వ్రాసారు ఇది ఇంగ్లీషు వారికే ఎంతో ఆశ్చర్యానందాలు కలుగజేసింది ఈయన తపః ఫలితంగానే, భారతదేశ స్వాతంత్ర్యం అరవిందుని జన్మతేది రోజున ఆగష్టు 15న మనకు వచ్చింది

భారతీయ ఆధ్యాత్మిక, తపోదీక్షకు నిలువెత్తు నిదర్శనం అరవిందయోగి ఇది లగ్నంలో గురుని ఉచ్చస్థితి వల్లనే ప్రాప్తించింది

గురుదశ విశేషంగా యోగించింది ఆశ్రమ స్థాపన విదేశీయులు శిష్యులుగా చేరడం జరిగింది

దేశ దేశాలు అరవిందుని పేరు మారుమోగింది గురుదశ చివర రాహు అంతర్దశలో దేహత్యాగం చేశారు

**ఉదాహరణ 4 కీరో, ప్రపంచ ప్రఖ్యాత హస్త సాముద్రిక శాస్త్రవేత్త**

**జననం 1868-11-1 ఉ 10-27**

| | | |
|---|---|---|
| 7 | చ | గు 4 |
| రా కు | రాశి | కే |
| 10 శు | ర | ల బు శ 1 |

జన నక్షత్రం కృత్తిక గురుడు పంచమ స్వక్షేత్ర స్థితి కోలముఖం గొప్ప మంత్రశాస్త్రవేత్త భారతదేశంలోని హిమాలయాలలో ఒక యోగి వద్ద, మంత్రవిద్యను, వేద్ నారాయణ్ జోషి వద్ద సాముద్రిక విద్యను నేర్చుకొని, సాముద్రిక శాస్త్రంలో ఋషితుల్యుడైనాడు 1908 నుంచి 16 సం॥లు గురుదశ 1924-8-19 వరకు విశేషంగా యోగించింది కీరో రష్యాపర్యటనలో, రష్యాలో ప్రసిద్ధ తాంత్రికుడు 'రస్‌పుటిన్', తో కలసినపుడు, కీరో విద్యను పరీక్షించడం కోసం తన భవిష్యత్ ఎలా ఉంటుందని 'రస్‌పుటిన్' ప్రశ్నించాడు అపుడు కీరో ఎంతో నమ్మకమై గంభీర స్వరంతో ఇలా చెప్పాడు 'భవిష్యత్తులో అంతఃపుర కుట్రలవల్ల నీవు మరణిస్తావు ముందుగా నీవు విష ప్రయోగం చేయబడతావు తరువాత ఒక వ్యక్తి నిన్ను వెనకాల పొడుస్తాడు మరొకడు తుపాకితో కాలుస్తాడు నీ శవం చల్లటినీటిలో తేలుతు ఉంటుంది ఇది నీ భవిష్యత్తుని నాకు గోచరమవుతున్నదని చెప్పాడు దీనికి 'రస్‌పుటిన్' ఆగ్రహించి, కిరోను రష్యా నుంచి పొమ్మనవలసినదని రాజకుటుంబానికి చెప్పాడు చివరకు అతని భవిష్యత్ మాత్రము అక్షరాలా కీరో చెప్పినట్లే జరిగింది ఏడుగురి హస్తముద్రలు పరిశీలించి, వారిని చూడకుండా వారిని చూడకుండా వారి వృత్తి వివరాలు అన్నీ చెప్పగలిగాడు ఈ విషయంను "న్యూయార్క్ వరల్డ్" అనే పత్రిక ప్రకటించింది ఈ సంఘటన అమెరికాలో 1893-11-25న జరిగింది దీనితో

కీరో కీర్తి మరింత వ్యాపించింది లండన్‌లో బాండ్ స్ట్రీట్‌లో, సాముద్రిక వృత్తి ప్రారంభించాడు తన 54 ఏట, మీనా డిక్సన్‌ను వివాహం చేసుకున్నాడు రష్యా విప్లవం, కింగ్‌జార్జ్, ఎడ్వర్డ్, రష్యా రాజ మాంత్రికుడు రస్ పుటిన్ మరణం, ఇటలీరాజు హంబర్ట్ 1 మరణం, ఇలా ఎన్నో కొన్ని వందల ఫలితాలు చెప్పాడు - 1936-10-8న, కీరో, దీర్ఘవ్యాధి పీడితుడై మరణించాడు

**ఉదాహరణ 5 సర్వేపల్లి రాధాకృష్ణన్. రాష్ట్రపతి పదవికే గౌరవం తెచ్చిన విశేష జ్ఞాన సంపన్నుడు. జననం 1888-9-5**

(10) (7)
శ రా | రాశి | కే
చ ర, ల, బు, శు (1) | కు, గు (4)

1953 నుండి 1969 వరకు - గురుదశ విశేషయోగం గజకేసరియోగం

**ఉదాహరణ 6 : బెర్ట్రాండ్ రస్సెల్ - తత్వవేత్త. జననం 1872-5-18**

ర రా కు | (7) బు శు |
(10) గు | రాశి | (4)
చ | ల (1) | కే శ

తులాలగ్నం దశమంలో గురుడు ఉచ్చస్థితి సప్తమ కేంద్రంలో బుధ-శుక్రులు - అందుకే గొప్ప గణిత మేధావీ తాత్వికుడు అయినాడు

**ఉదాహరణ 7 : లోకమాన్య బాల గంగాధర తిలక్**

**విద్యావేత్త, గొప్ప స్వాతంత్ర్య యోధుడు జననం 1856-7-23**

బు శ | (10) | రా చ గు
(1) ర ల శు | రాశి | (7)
కు కే | (4) |

భాగ్యంలో గురుడు స్వక్షేత్రస్థితి గజకేసరియోగం

**ఉదాహరణ 8 : రమణ మహర్షి - యోగి, జననం 1879-12-30 మ 1-00**

| | | |
|---|---|---|
| కే చ | కు (7) | శ గు |
| (10) | రాశి | (4) |
| | ల (1) | ర రా బు శు |

తులాలగ్నం పంచమ బుద్ధి స్థానంలో గురుడు, 5-6 పరివర్తన భాగ్యంలో కేతు-చంద్రులు ఈ గ్రహాల వల్లనే తపోసిద్ధి పూర్వజన్మను తెలియజేయు 9వ స్థానంలో చంద్ర-కేతువుల వల్ల, గత జన్మలో కూడా, తపోసాధన చేసినట్లు తెలుస్తోంది

**ఉదాహరణ 9 : షిర్డీ సాయిబాబా - యోగి, జననం 1837-5-18 రా. 8-21 సాక్షాత్తు గురు గ్రహం అంశతో జన్మించిన సిద్ధ పురుషులు. గజకేసరియోగం కలిగింది.**

| | | |
|---|---|---|
| (7) ర శు బు | రా | (4) |
| గు | రాశి | |
| కు (10) | శ చ కే | ల (1) |

భాగ్యంలో గురుడు ఉచ్ఛస్థితి పునర్జన్మను తెలియజేయు పంచమ రాశ్యాధిపతి శని, వ్యయంలో మనోకారకుడైన చంద్రునితో మోక్షకారకుడైన కేతువుతోనూ కలసి యుండటంవల్ల మోక్షప్రాప్తి పునర్జన్మ లేదు గురుబలం వల్ల తేజశ్శరీరం భౌతిక రూపంలో 81 సం॥లు జీవించారు

★ **గురు అనుగ్రహం వల్లనే, న్యాయాధిపతులు, లెక్చరర్లు, ప్రొఫెసర్లు, మంత్రులు, రాష్ట్రపతులు, మహాకవులు, యోగులు, తత్వవేత్తలు, ఉపాసకులు, జ్యోతిష పండితులు, వేద పండితులు, వక్తలు, ధనవంతులు అగుదురు**

**ఉదాహరణ 10 : రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ జననం 1884-12-3 ఉ 8-45**

| | | | |
|---|---|---|---|
| (7) చ శ | | | కే (4) |
| | | | |
| | రాశి | | |
| గు రా (10) | శు | ర కు బు ర (1) | |

గురు స్వక్షేత్రమైన ధనుస్సులో జననం గురుడు భాగ్యస్థానములో ఉండి వర్గోత్తమం పొందాడు గురు - చంద్రుల కేంద్ర స్థితివల్ల గజకేసరి యోగం న్యాయవాదవృత్తి విజయవంతంగా ఉన్న సమయంలో 1920లో, స్వాతంత్ర్య పోరాటం గూర్చి వృత్తిని వదలివేశారు గురుదశ బాగా యోగించింది బుధ దశ శుక్రభుక్తిలో, మధ్యంతర మంత్రి వర్గంలో చేరారు బుధదశ - చంద్రభుక్తిలో భారత ప్రధాన రాష్ట్రపతి పదవినలంకరించారు ఇది అధియోగ - గజకేసరియోగ ఫలితం

**ఉదాహరణ 11 మెహర్‌బాబా - యోగి జననం 1894 - 2 - 25 ఉ 4 30**

| | | | |
|---|---|---|---|
| గు | (4) | రా బు | శు ర |
| (7) | రాశి | ల (1) | |
| కే | చ శ (10) | కు | |

అధియోగం పట్టినది పంచమంలో గురుడు, మకరలగ్నం గురు దశ చివరిలో హజరాత్ బాబా జాన్‌ను, మెహర్ కలిశారు ఉపాసనీ మహారాజ్ ద్వారా ఆధ్యాత్మిక ఉన్నతిని సాధించారు

**ఉదాహరణ 12 : రాష్ట్రపతి కె.ఆర్ నారాయణన్. 1920-10-27 అశ్వనీ నక్షత్రం**

| | | | |
|---|---|---|---|
| (7) | కే చ | | (4) |
| | రాశి | | |
| శ (10) గు | ర లా | ల శు బు (1) | కు |

దశమంలో గురుడు, ఆధిపత్య శుభుడైన శనితో కలసి ఉండటం వల్ల రాజయోగం గురుదశ 1982 నుంచి విశేషంగా యోగిస్తోంది 1984లో, లోక్‌సభకు ఎన్నిక 1992లో ఉపరాష్ట్రపతి అయ్యారు 1997 లో గురుదశ రాహ్వంతరంలో భారత రాష్ట్రపతి అయ్యారు 1998-11-30 వరకు గురుదశ విశేష యోగం శని దశ శన్యంతరం మంచిది కాదు

**ఉదాహరణ 13 కింగ్ జార్జ్ 4. జననం 1895-12-14 ఉ. 3-05**




తులాలగ్నం లగ్నాధిపతి లగ్నంలో ఉచ్చస్థితి పొందిన శనితో కలయక దశమంలో గురుని ఉచ్చస్థితి గురు - శుక్ర - శనుల వల్ల 3 మహాపురుష యోగాలు పట్టినవి మొదటి ప్రపంచ సంగ్రామంలో 1918లో యూరఫ్ ఫ్రంట్‌కు ఎంతో సేవ చేశాడు ఉన్నత భాగ్యవంశ జననం ఎనలేని కీర్తి

**ఉదాహరణ 14 . ఛత్రపతి శివాజి జననం 1630-2-19 సా 6-26**




సింహలగ్నం లగ్నాన్ని లగ్నాధిపతి రవి, గురుడు చూస్తున్నారు అంశలో ధనుర్లగ్నం లగ్నంలో గురుడు గురుదశ బాగా యోగించింది చంద్రునికి 6-8లో గురు - శుక్రుల వల్ల అధియోగం రవి - గురుల కలయిక కేంద్రంలో హరబ్రహ్మయోగం గురుదశలో అనేక యుద్ధాలు గెలిచాడు శనిదశలో శివాజీని రాజుగా గుర్తించాడు ఔరంగజేబు శనిదశ - కేతు అంతరంలో, రాజ్యాభిషిక్తుడయ్యాడు శనిదశ - కుజాంతర్దశలో జ్వరము, రక్త గ్రహిణి వల్ల శివాజి తనువు చాలించాడు సింహలగ్నానికి సరైన సంపూర్ణ ఉదాహరణ శివాజీ

ఉదాహరణ 15 కేంద్రమంత్రి - చిదంబరం జననం 1945-9-16 రాత్రి 11-47 గజకేసరి యోగజాతకుడు

మిథున లగ్నం లగ్న చతుర్ధాధిపతి 3-4 పరివర్తన 1989-3-16 నుంచి గురుదశ విశేషయోగం 97-3-28 నుంచి 99-11-28 వరకు గురుదశ, శుక్ర అంతర్దశ, గురునిపై శని దృష్టి వల్ల యోగభంగం

**ఉదాహరణ 16 మహత్మగాంధి - గజకేసరి యోగ జాతకం.**

**జననం 1869-10-2 ఉ. 7-25**

1942లో గురు - బుధ దశాంతర్దశలలో, సహాయ నిరాకరణోద్యమం నిర్వహించారు 1947లో గురుదశ, శుక్రాంతర్దశలో గాంధీజీ స్వాతంత్ర్య స్వప్నం ఫలించింది తులాలగ్నానికి బాధకుడైన రవి, 12లో ఉండి, దశానాధుడు తులాలగ్నానికి మారకుడైనందున చంద్రరాశి కి ద్వితీయ మారక స్ధానంలో ఉన్న రవి అంతర్దశ, గురుదశలో, గాంధీ హత్యకావింపబడ్డారు ఈ విషయం శ్రీ బి వి రామన్ 10 నెలల ముందుగానే 1947 ఏప్రిల్‌లో ఆస్ట్రాలజికల్ మెగజైన్‌లో ఈవిధంగా చెప్పారు

Mars and Saturn will be conjunction in the last degree of Cancer on Nov 12, 1947 These combinations also point to the loss (by assassination as violent Mars is with saturn in 12th) of a respected mass leader of this country (P247)

గాంధీ హత్యకు 10 నెలల ముందు ఇది ప్రచురణ అయింది ఇటువంటి అనేక ప్రముఖ చారిత్రక ఘటనలు జ్యోతిష శాస్త్రపరంగా చెప్పిన బి వి రామన్ ప్రపంచ జ్యోతిష వేత్తలలో ప్రముఖ స్ధానం పొందారు

ఉదాహరణ **17**. మొరార్జీ దేశాయ్ భారత ప్రధాని. జననం **1896-2-29** మ. **1** గం మరణం **1995-4-10**

| | | |
|---|---|---|
| ల (1) | | (10) రా ర |
| గు | రాశి | శు బు కు |
| చ కే (4) | శ | (7) |

ఉత్తర నక్షత్రం, సింహరాశి, మిధునలగ్నం కుజ - గురు - శనులు ఉచ్ఛస్థితి, 99 సం॥లు దాటి జీవించిన పూర్ణ పురుషుడు గురుదశ 1951 - 10-23 వరకు యోగించింది

ఉదాహరణ **18 :** మర్రి చెన్నా రెడ్డి, గవర్నర్, జననం **1919 - 1 - 13,** రాత్రి **10-49,** మరణం **1996 - 12 - 2**

| | | |
|---|---|---|
| చ కే (10) గు | | (7) రా ర |
| (4) | రాశి | శ కు ర |
| శ ల (1) | | బు రా |

మృగశిరానక్షత్రం, కన్యాలగ్నం, 4-10, గురు - బుధులు పరివర్తన గురు బుధులు స్వనవాంశ, రవివర్గోత్తమం, దశమ గురుడు విశేషంగా యోగించాడు మంత్రి పదవులు, ముఖ్యమంత్రి, అనేక రాష్ట్ర గవర్నరు పదవులు నిర్వహించారు ఆమరణాంతం ఎన్నో పదవులు పొందడం విశేషం 1941 నుంచి 1957 వరకు గురుదశ యోగం కేతుదశ రాహ్వాంతరంలో మరణించారు

ఉదాహరణ **19** · వి కె కృష్ణమానన్, కేంద్రమంత్రి జననం **1896-4-21,** మరణం **1974**

| | | |
|---|---|---|
| బు (7) | ర శు | (4) రా కు |
| గు | రాశి | చ |
| కే (10) | శ | ల (1) |

లగ్నం గురుని లగ్నం ధనుస్సు రవి - గురు - శనుల ఉచ్చస్థితి లగ్నాధిపతి అష్టమస్థితి మహావిజ్ఞాని గురుదశ యోగించింది గజకేసరియోగం

**ఉదాహరణ 20 జిడ్డు కృష్ణమూర్తి, తత్వవేత్త**

**జననం : 1895-5-11 రాత్రి 12-10, మరణం 1986-2-16**

కాలిఫోర్నియాలో జన్మించిన సమయంలో 12-10 రాత్రి మరణించారు

| | | |
|---|---|---|
| బు గు కు శు | (4) ర | రా |
| (7) | రాశి | (1) ల |
| కే | (10) శ | చ |

అష్టమంలో కేతువు, వ్యయంలో చంద్రుడు, గుప్తమైన కుండలినీ శక్తి ప్రబోధానికి కారకులయ్యారు 5-6 అధిపతులు బుధ శుక్రుల పరివర్తన, చంద్రలగ్న ప్రధాన జాతకమిది గురుని రాశి ధనుస్సులో జననం, కోలముఖం, వెలుగు జిమ్మే నేత్రాలు 6-12లో గజకేసరియోగం

**ఉదాహరణ 21 : స్వామి జ్ఞానానంద, తత్వవేత్త, జననం 1896-12-5 ఉ 6-26 మరణం 1969-9-21.**

| | | |
|---|---|---|
| (7) కు | | (4) |
| కే | రాశి | రా |
| గు (10) | శ | ల (1) శు ర శ చ బు |

ధనుర్లగ్న జననం, గురుడు భాగ్యస్థితి, స్వయంకృషి వల్ల, విజ్ఞాన సముపార్జన, రాహుదశ, కుజ అంతర్దశలో దేహత్యాగం చేసారు 9-12 లో గజకేసరియోగం అష్టమ కేతువు, ఆధ్యాత్మిక కేతువు, ఆధ్యాత్మికస్థితి, వ్యయ చంద్ర రవి, బుధ, శనులు, వైరాగ్య భావం సన్యాసిజీవితం

**ఉదాహరణ 22 . అటల్ బిహారీ వాజ్‌పేయి, భారత ప్రధాని జ 1926-12-25 ఉ 5-00**

| | | |
|---|---|---|
| (7) రా | కు | (4) గు |
| | రాశి | |
| చ (10) | | శు కే ర (1) శ ల బు |

సింహరాశి, వృశ్చికలగ్నం లగ్నంలో శని – బుధలు శని ఉగ్రత్వానికి, బుధుడు కల్లెంవేసిన ఆలోచన చేయించి మాట్లాడిస్తాడు వాక్ స్థానంలో, శుక్ర, కేతు, రాహువులవల్ల, నిజాయితీపరుడు చతుర్ధాకేంద్ర గురునివల్ల 14 భాషలలో పాండిత్యం 1984-12-6 నుండి గురుదశ 2000-12-6 వరకు విశేషయోగం 4-10లో గజకేసరియోగం

**ఉదాహరణ 23 రజనీకాంత్, ప్రఖ్యాత నటుడు జననం 1950-12-12**




సింహలగ్నం కుజుడు ఉచ్చస్థితి తీక్షస్వభావం లగ్నంపై గురుదృష్టి 1983-2-10 నుండి 1999-2-10 వరకు, గురుదశ విశేష యోగం శ/శలో అరిష్ట సూచనలున్నవి

**ఉదాహరణ 24 చిరంజీవి, ప్రఖ్యాత నటుడు జననం. 1955-8-22, ఉ. 10-00**




గురుదశ విశేషంగా యోగించిన జాతకులలో చిరంజీవి ఒకరు 1977-7-30 నుంచి 16 సం॥లు 1993-7-30 వంకు, గురుదశ యోగించింది గురు శనుల ఉచ్చస్థితి, దశమ గురుడు, లాభ స్థానంలో 4 గ్రహములు 1999-4-12 నుండి 2000-5-12 వరకు శనిదశ కేత్వంతర్దశలో, ఆధ్యాత్మిక చింతన, కుండలినీ యోగం సిద్ధించే అవకాశం

**ఉదాహరణ 25 · చంద్రబాబునాయుడు, ముఖ్యమంత్రి జననం 1951-4-20**



మీనలగ్నం, లగ్నంలో గురుడు, 1-7లో గజకేసరియోగం అయితే శనికలయిక చంద్రునికి, శని దృష్టి గురునికి ఏర్పడింది 1985 నుంచి 16 సం॥లు గురుదశ విశేషయోగం 2001-10-20 వరకు గురుదశ, చివరలో యోగభంగం

**ఉదాహరణ 26** ప్రధాన న్యాయమూర్తి. జ **1907-12-30**రాత్రి **9-55**




గురు దృష్టి ఉచ్చస్థానం నుంచి, దశమాధిపతి అయిన శుక్రునిపై పడింది
గజకేసరియోగం 3-12లో ఏర్పనింది

**ఉదాహరణ 27 .** ప్రధాన న్యాయమూర్తి జననం **1924-6-29** ప **11-28**




గజకేసరి యోగం 4-10లో పట్టింది చంద్రుడు ఉచ్చస్థితి లగ్నాధిపతి బుధ శుక్రులతో లాభస్థితి 1956 నుంచి గురుదశ యోగం

**ఉదాహరణ 28** జ్యోతిష పండితుడు జననం **1857-2-8** ఉదయం **8-30**



మీనలగ్నం గురుడు లగ్నంలో స్వక్షేత్రస్థితి రాహువుతో గురుడు స్వనవాంశ జ్యోతిషంపై ఎన్నో గ్రంధాలు వ్రాసారు

**ఉదాహరణ 29 : పాశ్చాత్య జ్యోతిష పండితుడు**

**జననం 1887-1-31 రాత్రి 11-01 (జి ఎమ్ టి )**

| | | |
|---|---|---|
| ⑩ శ | చ | ⑦ కే శు కు |
| | రాశి | బు ర |
| రా ల ① | గు | ④ |

లగ్నాధిపతి పంచమస్థితి 5-10 అధిపతులు శని - బుధల పరివర్తన పంచమాధిపతి, దశమంలో ఉన్నందున భవిష్య జ్ఞాన శక్తి ద్వితీయంలో గురుని వల్ల వాక్సిద్ధి

**ఉదాహరణ 30 షిప్పింగ్ వ్యాపారవేత్త జననం 1914-3-12**

| | | |
|---|---|---|
| శ కు | ⑦ | శు రా బు ర |
| ⑩ | రాశి | గు ④ |
| కే చ | ల ① | |

44సం॥ నుంచి, గురుదశ 16 సం॥లు ధనపరంగా విశేషంగా యోగించింది ఒకే కుమారుడు, 4 గురు మనుమలు కుటుంబ వృద్ధి, ధనవృద్ధి కలిగాయి నియమబద్ధమైన నిష్ఠాగరిష్ఠుడు వేద శాస్త్రములందు, అపరిమిత ఆదరణ

**ఉదాహరణ 31 · మేడవరపు పండిత సుబ్రహ్మణ్య శాస్త్రి, జననం 1888-1-20**

ఈ "గురుగ్రహం" పుస్తక రచయిత తండ్రి, ధనవంతుడు, పండితుడు, భోగి, 81 సం॥లు జీవించిన గురువ్యక్తి

| | | |
|---|---|---|
| ⑩ రా | చ | బు ⑦ |
| శ | రాశి | ర కు |
| ల ① | ల | కే ④ గు శు |

చతుర్థంలో గురుశుక్రుల కలయిక, మాతృ కారకుడైన చంద్రునికి అష్టమ స్థానంలో ఏర్పడింది అందువలనే బాల్యంలోనే మాతృవియోగం ఇదొక్కటే జాతకునికి లోటు గురు అను గ్రహం చేత, ధన - కుటుంబ - విద్యా మంత్రోపాసన, కీర్తి ప్రతిష్ఠలు కలిగాయి

**ఉదాహరణ 32 ఉపాధ్యాయుడు జననం 1938-3-15**

| | | |
|---|---|---|
| కే | (1) ల కు | ర బు శ శు |
| (4) | రాశి | గు (10) |
| చ | (7) | రా |

గురుకారకత్వమైన బోధనావృత్తిలో జీవనం ధన - కుటుంబ - పుత్ర, పౌత్రవృద్ధి గురుదశ యోగదాయకం

**ఉదాహరణ 33 వ్యాపారవేత్త జననం 1947-6-8**

| | | |
|---|---|---|
| ర రా బు | (4) కు | |
| (7) శ | రాశి | ల చ (1) |
| గు | ల (10) | కే |

మకరలగ్నం లగ్నంపై లగ్నాధిపతి దృష్టి దశమంలో వక్రగురుడు ధన కుటుంబ - పుత్ర - వృద్ధి గురుదశలో వ్యాపారంలో విశేష ధనవృద్ధి కుటుంబ వృద్ధి కలిగింది

**ఉదాహరణ 34 : ఉపాధ్యాయుడు జననం 1909-7-16**

| | | |
|---|---|---|
| బు చ ర రా శు | (7) | శ కు |
| (10) | రాశి | (4) |
| గు | (1) ల | కే |

గురుడు బాధక స్థానంలో ఉన్నాడు దశమాధిపతి అష్టమస్థితి ఉపాధ్యాయ వృత్తిలో జీవనం గురుదశ బాగా జరిగింది

**ఉదాహరణ 35 . పారిశ్రామికవేత్త జ 1950-8-20 సా 6-21**




ధనలాభాధిపతి అయిన గురుడు లగ్నంలో ఉన్నాడు శుక్ర - బుధులు, లగ్నాత్ అధియోగం ధనవంతుమైన కుటుంబంలో జననం వ్యాపారంలో విశేష భాగ్యవృద్ధి గురుని వల్ల శనిభక్తి

**ఉదాహరణ 36 · బేనజీర్ భుట్టో జననం 1953-6-21 రాత్రి 7-43**




గురులగ్నమైన ధనస్సులో జననం కోలముఖం ఉన్నత విద్య 1990 వరకు గురుదశ పంచమ దృష్టి చేత దశమశనిపై గురు దృష్టి - ఈ గురు శనుల వల్ల ప్రజాభిమానం పొంది, ప్రధానమంత్రి పదవి పొందడం జరిగింది 2000-9-24 తరువాత శనిదశ, రవ్యంతరం మంచిది కాదు

## గురుడు - 3వ సంఖ్య

సంఖ్యాశాస్త్రంలో గురుగ్రహం సంఖ్య 3 వారములలో గురువారము, గురుగ్రహ ప్రభావం ఉన్న వ్యక్తులు 3-12-21-30 తేదీలలో జన్మిస్తారు వీరి అదృష్టసంఖ్య 3 ఈ సంఖ్య ఆశావాదం - అభివృద్ధి - ఆత్మ - మనస్సు - శరీరముల త్రయస్వరూపమును, స్వతంత్ర భావమును, తత్వ శాస్త్రమును, మత సంబంధావేశమును, వాక్చాతుర్యమును, పాండిత్యమును సూచిస్తుంది

## గురుని అనుగ్రహం పొందడం ఎలా ?

ఈ క్రింది చెప్పిన ప్రక్రియలు కేవలం, రవి – చంద్ర – కుజ – గురు – కేతు దశాంతర్దశలు జరుగువారికి సత్ ఫలితాలనిస్తాయి

1 గురు గ్రహం అధిష్టానదేవత బ్రహ్మ గురువారం రోజున బ్రాహ్మణులను పూజించి, వారిని ఆనందింపచేయవలయును పంచదార లేదా తీపివస్తువులు, లవణం, బంగారం దానం చేస్తే గురుగ్రహం యొక్క అనుగ్రహం కలుగుతుంది

2 3 గురువారములు 3 కేజీల చొప్పున, పచ్చిశెనగలు బ్రాహ్మణులకు దానం చేయాలి

3 పసుపు వస్త్రములు, పుష్యరాగములు, బంగారము గురువారము, గురుహోరలో దానం చేస్తే గుర్వను గ్రహము పొంది జాతకుడు సుఖము పొందును

4 కనకపుష్యరాగము గురుహోరలో చేయించి పాలతో కడిగి, ప్రాణ ప్రతిష్ఠచేసి కుడిచేయి చూపుడు వ్రేలికి ధరించాలి

5 గురువారం, పునర్వసు – విశాఖ – పూరాకవభాద్ర రోజులలో దేవ – బ్రాహ్మణ గురులను సంతోషింపజేయాలి వారికి సంతృప్తి కలిగించాలి

6 దేవతా – బ్రాహ్మణ – గురుదూషణ చేయరాదు పెద్దలను, విద్యావంతులను దూషించిన గురుగ్రహం యొక్క శాపమునకు గురికాగలరు

## గురుని 24 నామాలు

శ్లో॥ బృహస్పతి స్సురాచార్యోదయావాన్ శుభలక్షణః
లోకత్రయ గురు శ్రీమాన్ సర్వజ్ఞః సర్వకో విదః ॥
సర్వేశః సర్వదాభీష్టః సర్వజిత్ సర్వపూజితః
అక్రోధనో మునిశ్రేష్ఠో నీతికర్తా గురుః పితా ॥
విశ్వాత్మా విశ్వకర్తాచ విశ్వయోనిరయోనిజః
భూర్భువస్సువరంచైవ భర్తాచైవసుహాబలః ॥
పంచవింశతి నామాని పుణ్యాని నియతాత్మనా
నందగోప గృహాసీనః విష్ణునా కీర్తితానివై ॥
ప్రాతరుత్థాయ పరితా వర్తయేత్సు సమాహితః
విపరీతోపి భగవాన్ ప్రీతిస్తస్య బృహస్పతిః ॥
యశ్శృణోతి గురుస్తోత్రం చిరంజీవిన సంశయః
గోసహస్ర ఫలంతస్య విష్ణుర్వచన మబ్రవీత్ ॥
బృహస్పతి కృతాపీడాన కదాచిద్భవిష్యతి

గురుగ్రహమును పసుపురంగుపూలతో పూజించి ఈ 24 నామములు పఠించిన వారికి గురుడు చెడు రాశులయందున్ననూ ప్రసన్నుడగును

## గుర్వష్టోత్తరశతం

శ్లో ॥ గురుర్గుణ వరో గోప్తా గోచరోగోపతి ప్రియః
గుణీగుణవతాం శ్రేష్ఠో గురుణాంగురు రవ్యయః ॥
జేతా జయంతో జయదో జీవోనంతో జయావహః
అంగీరసోధ్వరాసక్తో వివిక్తో ధ్వరకృత్పరః ॥
వాచస్పతి ర్వశీవశ్యో వరిష్ఠో వాగ్విచక్షణః
చిత్తశుద్ధి కరశ్రీమచ్చైత్రశ్చిత్ర శిఖండిజః ॥
బృహద్రధోబృహద్భానుః బృహస్పతిరభీష్టదః
సురాచార్యస్సురారాధ్యః సురకార్య హితం కరః ॥
గీర్వాణ శోషకోధన్యో గీష్పతిర్గిరిశోనఘః
ధీవరో ధిషణో దివ్య భూషణో దేవపూజితః ॥
ధనుర్ధరో దైత్య హంతా దయాసారా దయాకరః
దారిద్ర్యనాశకో ధన్యో దక్షిణాయన సంభవః ॥
ధనుర్మీనాధిపోదేవో ధనుర్బాణ ధరోహరః
అంగీరసాబ్ద సంజాతో అంగీరసకులోద్భవః ॥
సింధుదేశాధిపోధీమాన్ స్వర్ణవర్ణశ్చతుర్భుజః
హేమాంబరో హేమవపుః హేమ భూషణ భూషితః ॥
పుష్యనాధః పుష్యరాగః మణిమండలమండితః
కాశపుష్పసమానాభో కలిదోషనివారకః ॥
ఇంద్రాధి దేవో దేవేశో దేవతాభీష్టదాయకః
అసమాన బలస్సత్వ గుణ సంపద్వి భాసురః ॥
భూసురాభీష్టదో భూరి యశః పుణ్య వివర్ధనః
ధర్మ రూపో ధనాధ్యక్షో ధనదో ధర్మపాలనః ॥
సర్వవేదార్ధ తత్వజ్ఞో సర్వాపద్వినివారకః
సర్వపాప ప్రశమనః స్వ మాతానుగతామరకః
ఋగ్వేద పారగో ఋక్షఃరాశిమార్గ ప్రచారకః
సదానందస్సత్య సంధో సత్యసంకల్ప మానసః ॥
సర్వాగమజ్ఞః సర్వోజ్ఞో సర్వవేదాంత విద్వరః
బ్రహ్మపుత్రో బ్రహ్మణేశో బ్రహ్మవిద్యా విశారదః ॥
సమానాధిక నిర్ముక్తః సర్వలోక వశంకరః
వసురాసుర గంధర్వ వందితస్సత్యభాషణః ॥
ఇతి బృహస్పత్యష్టోత్తర శతనామ స్తోత్రం సంపూర్ణం

## గురుగ్రహ మంగళ స్తోత్రం

శ్లో ॥ జీవశ్చాంగిర గోత్ర జోత్తరముఖో దీర్ఘోత్తరాశాస్థితః
పీతోశ్వత్థ సమిశ్చ సింధు జనితశ్చాపోధమీనాధిపః ।
సూర్యేందుక్షితిజాః ప్రియాబుధసితా శత్రూసమాశ్చాపరే
సప్తద్వేనవ పంచమే శుభకరః కుర్యాత్సదామంగళమ్ ॥

## పురాణోక్త గురుగ్రహ శాంతి

శ్లో ॥ దేవానాంచ ఋషీణాంచ గురు కాంచన సన్నిభం ।
బుద్ధిమతం త్రిలోకేశం తంనమామి బృహస్పతిమ్ ॥
మంత్రం ఈ శ్లోకమును 16 వేలు జపించాలి

## గురుని గోచార మంత్రం

"ఓం హ్రాం హ్రీం హ్రౌం సః బృహస్పతయేనమః ॥

## వేదోక్త గురుగ్రహశాంతి

ఓం అస్యశ్రీ బృహస్పతి మహామంత్రస్య అప్రతిరధ ఋషిః త్రిష్టుప్ ఛందః బృహస్పతి గ్రహో దేవతా, యజ మానస్య కామకాయన విశ్వామిత్ర గోత్రస్య సంపత్ కుమార్ నామధేయస్య అధిదేవతా, ప్రత్యధి దేవతా సహిత బృహస్పతి గ్రహారాధనే వినియోగః ।

ధ్యానం – సౌమ్యేసుదీర్ఘే చతురస్ర పీఠే రధేంగి రాః పూర్వముఖ స్వభావః । దండాక్షమాలా జలపాత్రధీరా సింధ్వాఖ్య దేశీ వరదస్సురేశః ॥ మంత్రం – బృహస్పతే పరిదీయారధేనా రక్షోహామిత్రా రపబాధ మానః । ప్రభంజన్ సేనాః ప్రమృణోయుధా జయన్నస్మాకమేధ్యవితా అధానాం ॥ ఓం భూర్భువస్సువః ॥ బృహస్పతి గ్రహ ఇహాగచ్ఛ, బృహస్పతి గ్రహం కనకవర్ణం, కనక గంధం కనక పుష్పం, కనక మల్యాంబరధరం, కనకచ్ఛత్ర ధ్వజరధ పతాకాది శోభితం, దివ్యరథా సమారూఢం, మేరుం ప్రదక్షిణీ కుర్వాణం పూర్వాభిముఖం, పద్మాసనస్థం, చతుర్భుజం, దండాక్షమాలాధారిణం, సింధు ద్వీపదేశాధిపతిం, ఆంగీరస గోత్రం ధాతృసంవత్సరే వైశాఖమాసే కృష్ణపక్షే చతుర్ధశ్యాం భరణే నక్షత్రే జాతం ధనుర్మీనరాశ్యా ధిపతి గురువార ప్రయుక్తం కిరీటినం, సుఖాసీనం, పత్నీపుత్ర పరివారసమేతం గ్రహమండలే ప్రవిష్టమస్మిన్నధికరణే సూర్యగ్రహస్య ఉత్తర దిగ్భాగే, దీర్ఘ చతురస్ర మండలే బృహస్పతి గ్రహమావాహయామి పూజయామి

## అధిదేవత - బ్రహ్మ

ధ్యానం – బ్రహ్మాణం రక్తగౌరాంగం చతుర్వక్త్రం జగత్ప్రభుం ।
అక్షస్రక్కుండికాభీతి పరపాణిం విచితయేత్ ॥

మంత్రం - బ్రహ్మ జజ్ఞానం ప్రథమం పురస్తాద్విసమేత స్సురోచోవేన ఆవః । సబుధ్నియా ఉపమా అస్యవిష్ఠా సతశ్చయోని మసతశ్చవివః ॥ ప్రత్యధిదేవత - ఇంద్రుడు ధ్యానం - ఇంద్రమైరావతారూఢం వజ్రాయుధ ధరం (పభుం) పూర్వ దిక్పాలకం దేవం సర్వదేవ సమస్కృతం ॥ మంత్రం - ఇంద్రంవో విశ్వతస్పరి హవామహే జనేభ్యః అస్మాకమస్తుకేవలః ॥

॥స్వస్తి॥

## గురుయంత్రం

ఇది రాగి - వెండి - బంగారు రేకుపై వ్రాసి, పూజించి గురువారం గురుహోరలో ధరిస్తే గురు అనుగ్రహం కలుగుతుంది

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 2 | 1 | 3 | 5 | 4 | 6 | 8 | 7 | 9 |
| 8 | 7 | 9 | 2 | 1 | 3 | 5 | 4 | 6 |
| 5 | 4 | 6 | 8 | 1 | 9 | 2 | 1 | 3 |
| 6 | 5 | 4 | 9 | 8 | 7 | 2 | 1 | 3 |
| 3 | 2 | 1 | 6 | 5 | 4 | 9 | 8 | 7 |
| 9 | 8 | 7 | 3 | 2 | 1 | 6 | 5 | 4 |
| 7 | 9 | 8 | 1 | 3 | 2 | 4 | 6 | 5 |
| 4 | 6 | 5 | 7 | 9 | 8 | 1 | 3 | 2 |
| 1 | 3 | 2 | 4 | 6 | 5 | 7 | 9 | 8 |

## గురుదశలో శాంతి

గురుదశలో గుర్వంతరంలో శ్రీ రుద్ర జపము, సమకచమక పారాయణ, శన్యంతర్దశలో మృత్యుంజయ జపము, బుధాంతర్దశలో గోదానము, కేత్వంతర్దశలో శివలింగార్చన, శుక్రాంతర్దశలో కృష్ణమంత్రం జపము, రవ్యంతర్దశలో సూర్య నమస్కారములు, చంద్రాంతర్దశలో మేకదానము, కుజాంతర్దశలో మేకదానము, రాహ్వంతర్దశలో తిలహోమము చేయవలయును

## గురుగ్రహ స్నానం

మారేడు - మర్రి - ఉసిరి ఈ మూడు రకముల ఫలములతో కలసిన నీరు, బంగారు పాత్రతో స్నానము చేసినచో గురుగ్రహమునకు సంతోషకరమగును గురువారము చేసిన మరింత మంచిది

## గురుగ్రహ కీర్తన

రచన – ముత్తుస్వామి దీక్షితులవారు (1775 – 1834) ఇది ఎంతో ప్రభావం కలిగిన కీర్తన దీనిని రాగయుక్తముగా పాడి గురుని పూజించిన, కోరిన కోర్కెలు తీరును బీజాక్షర సంపుటి చేయబడినది

## రాగం - అఠానా, తాళం - త్రిపుట

పల్లవి బృహస్పతే తారాపతే బ్రహ్మజాతే నమోస్తుతే ।

అనుపల్లవి మహాబలవిభో గీష్పతే మంజుధనుర్మీనాధిపతే
మహేంద్రాద్యుపాసితాకృతే, మాధవాదినుత ధీమతే ॥

చరణం సూరాచార్యవర్య వజ్రధర శుభలక్షణ జగత్రయగురో
జరాదివర్జితా క్రోధ కచజనకాశ్రిత జనకల్పతరో
పురాది గురు గుహసమ్మోదిత పుత్రకారక దీనబంధో
పరాదిచత్వారివాక్ స్వరూప ప్రకాశకదయాసింధో
నిరామయాయ నీతి కర్త్రే నిరంకుశాయ విశ్వభర్త్రే
నిరంజనాయ భువనభోక్త్రే నిరశాయ ముఖప్రదాత్రే ॥
గురుగ్రహార్పణమస్తు
॥ శివార్పణమస్తు ॥

## గోచార గురుని ప్రభావం

గురుగ్రహం శుభగ్రహాల రెండింటిలో మొదటిది శుక్రగ్రహం రెండవది జాతకరీత్యాగాని, దశాంతర్దశలలో గాని గోచారరీత్యా శని 1-2-12-4-8 రాశులలో సంచరిస్తూ చెడు ఫలితములు సూచింపబడుతున్నపుడు, పాపగ్రహముల దశాంతర్దశలు జరుగుతున్నపుడు, గోచారరీత్యా గురుడు శుభస్థానములో ఉన్నట్లయితే, ఆ అశుభ ఫలితములు తగ్గి, కొంత ఉపశాంతిగా ఉంటుంది

గ్రహాలకు చేయు జపదాన హోమములు కూడా జాతకచక్రములో గురుడు శుభస్థానములో ఉంటేనే శీఘ్రంగా ఫలిస్తాయి గురుబలం లేని వ్యక్తి ఏ పని చేపట్టినా అది సత్ఫలితాలనివ్వదు కొందరు ఎన్నో జపాలు, దానాలు చేసినా ఫలితం ఏమీ కనబడటం లేదని అంటూంటారు వారికి గురుబలం లేదని తెలుసుకోవాలి

గురుగ్రహం గోచారరీత్యా ఇతర గ్రహాలు, అనగా రవ్యాది ఇతర గ్రహాల స్థానం నుంచి సంచరించు స్థాన ఫలితములు ఇపుడు పరిశీలిద్దాం ఇది అనుభవంలో ఎంతో బాగా సరిపోవుచున్నది

గురుడు జాతకచక్రంలోని కుజుని రాశిలోగాని కుజునికి 5-9-11 స్థానాల్లో గాని సంచరించునపుడు, మనోనిశ్చయం – విజయం కార్యోత్సాహం – వ్యాపారవృద్ధి సంభవిస్తాయి కుజునికి 6-8-12 స్థానాల్లో గురుని సంచారం ప్రమాదాలు – ప్రయాణాల్లో కష్టాలు, అగ్నిభయం, దావాల్లో పరాజయం – అనారోగ్యం కలుగుతాయి జాగ్రత్త అవసరం జపశాంతులు చేయించుకోవాలి గురుజపం చేయాలి

బుధుడున్న రాశిలోగాని, ఆ రాశికి 4-7-10-5-9-11 స్థానాల్లో గాని గురుడు సంచరించునపుడు, సంతోషం, పదోన్నతి, లలితకళల రీత్యా ముఖ్యంగా చిత్రకళ - సంగీతం - రచనారంగాల్లో అభివృద్ధి, పుస్తక ప్రచురణ, జర్నలిజం - ప్రయాణాలు లభిస్తాయి సాంఘిక కార్యక్రమాల్లో చురుగ్గా పాల్గోవడం సంభవిస్తాయి

బుధునికి 6-8-12 రాశులలో గురుడు సంచరించునపుడు - విమర్శలు - అవమానం - మోసగింపబడటం మొదలగు అశుభఫలితాలు కలుగుతాయి

గోచారరీత్యా గురుడు జాతకచక్రంలోని గురుడున్న రాశిలోగాని, ఆ రాశికి కేంద్రకోణాల్లోగాని సంచరించునపుడు గౌరవం - లాభం - షేర్ మార్కెట్ - స్పెక్యులేషన్ - లాటరీలలో విజయం - దూరప్రయాణాలు - దైవ కార్యక్రమాలలో పాల్గొనడం - నిర్వహించడం - ఆధ్యాత్మిక సాధనలు - ఇంటిలో శుభకార్యాలు - పవిత్ర నదీస్నానం జరుగుతాయి

గురునికి 6-8-12 స్థానాలలో గురుడు సంచరించునపుడు ఆర్థిక నష్టం - అపఖ్యాతి - వృత్తి భంగం - అనారోగ్యం - అజాగ్రత్త వలన నష్టం - నీరసం సంభవిస్తాయి

గోచార గురుడు శుక్రరాశికి వచ్చినట్లయితే లేదా శుక్రునికి కేంద్రకోణ రాశులలో గాని సంచరించునపుడు - వివాహం - పుత్రప్రాప్తి, స్త్రీ సుఖం - ఖ్యాతి లభిస్తాయి కుటుంబ సంతోషం - వ్యాపారవృద్ధి - ప్రయాణాల వల్ల లాభం - వివిధ రకాల సంతోషం - పదోన్నతి సంభవిస్తాయి

శుక్రునికి పాపస్థానాల్లో గురుని సంచారం అంతగా బాధించదు కారణం శుక్రుడు కూడా శుభగ్రహం కావడమే ఇరువురికీ శతృత్వమే అయినా కళత్ర పీడ తప్ప ఇతరములయిన బాధలు అంతగా ఉండవు

గురుడు శని ఉన్న రాశిలో గాని శనికి 3-6-11 స్థానాలలోగాని సంచరించునపుడు, గొప్పవారి నుంచి సహాయము - దీర్ఘకాలిక ఒప్పందములు - భూ - గృహ సంబంధ లాభములు - బహుమతులు సంభవిస్తాయి చాలా మంచి కాలం ఆరోగ్యం కూడా బాగుంటుంది

అదే శనికి 4-8-12 స్థానాలలో గురుడు సంచరించునపుడు, ఉద్యోగ భంగం - వ్యాపార నష్టం - గృహ నష్టం - ఆర్థికంగా నష్టపడటం జరుగుతుంటాయి బాధ్యతలు పెరుగుతాయి అనారోగ్యం ఏర్పడుతుంది దానాలు, జపశాంతులు చేయాలి

జన్మరాహువు రాశిలోగాని, ఆ రాశికి 3-6-11 స్థానాలలోగాని గురుడు సంచరించునపుడు నూతన ఆలోచనలు, శాస్త్ర పరిశోధన - తంత్ర సాధన - ప్రచురణ - అభ్యసించిన విద్యకు సార్థకత - రహస్యపరమైన తంత్ర సిద్ధులు - ప్రఖ్యాత పురుషుల ప్రాపకం లభిస్తాయి

అదే రాహువుకు 4-8-12 స్థానాలలో గురుని సంచారం వల్ల వ్యాపారాలలో మోసం, చట్ట వ్యతిరేక కార్యక్రమాలు చేయడం వల్ల నష్టం జరుగుతాయి మద్యపానం వల్ల దుష్ఫలితాలు, విషపూరితమైన ఆహారసేవనం సంభవిస్తాయి జాగ్రత్త చాలా అవసరం

కేతువు స్థానంలోగాని, కేతువు ఉన్న రాశికి 3-6-11 స్థానాలలో గాని, శుభుడయిన గురుని సంచారం వల్ల ధనలాభం - అధ్యయనం - మత సంబంధమైన కార్యక్రమాలలో పాల్గొనడం భక్తి - జ్ఞాన - వైరాగ్యము లందు ఆసక్తి - ప్రభుత్వపరమైన లాభం - విదేశీయానం - అభివృద్ధి - పుస్తక ప్రచురణ సంభవిస్తాయి ఈ కేతువుకు 4-8-12 స్థానాలలో గురుని సంచారం వల్ల, గృహ మార్పు, బంధు - మిత్ర - జననీ జనకులకు అరిష్టం - కష్టాలు - అపవాదులు సంభవిస్తాయి జపదానహోమ అర్చనాభిషేకరాదులు - మన్యుసూక్త - రుద్ర పారాయణలు చేయించుకోవాలి

## కారక గ్రహములు

గురుడు – శుక్రుడు కారక గ్రహములైనపుడు వారిచ్చు ఫలితములు ఎలా ఉంటాయో చూద్దాము అసలు కారకగ్రహములంటే ఏమిటో ముందుగా మనం తెలుసుకోవాలి గ్రహములకు నైసర్గిక రీత్యా వారిచ్చు శుభఫలితములు, ఆధిపత్య, స్థితిరీత్యా వారిచ్చు ఫలితములు వేరేగలవు లగ్నభావ కారకత్వము, ధనభావ కారకత్వము – అలాగే భ్రాతృభావకారకత్వము కుజునకు, పుత్రభావ కారకత్వము గురునకు, కళత్రభావ కారకత్వము శుక్రునకు గలవు ఇవిగాక "కారక" సంజ్ఞ వేరేగలదు అదేమిటంటే

శ్లో ॥ లగ్నస్థ స్సుఖసంస్థ దశమస్థోపి కారకాస్సర్వే। ఏకాదశేపి కేచిద్వాంఛంతి నతన్మతం మునీంద్రాణామ్॥

తా – లగ్న – చతుర్థ – దశమములందున్న గ్రహములు కారకులని సంజ్ఞ పదకొండవ స్థానమందున్న గ్రహములను కూడా కారకులనవలెనని కొందరు చెప్పుచున్నారు కాని ఋషులకు అంగీకారము కాదు

శ్లో ॥ నీచకులే సంభూతః కారకవిహగైః ప్రధానతాంయాతి । క్షితిపతి వంశసముత్థో భవతి నరేంద్రోన సందేహః ॥

తా – జాతకచక్రములో గ్రహములన్నియూ కారకులైనచో, తక్కువ కులమందు పుట్టిననూ ఉన్నత పదములు పొందును వ్యాపారములందు రాణించును

శ్లో ॥ కారక వేధో బలవాన్ మూలం యోగేషు కీర్తితో హరిణా । తస్మాత్ఫల నిర్దేశః కారక భేదాది భిర్వాదం ॥

తా – జాతకములందు యోగ ఫలితములు జరుగవలెనన్న కారక వేధ తప్పక యుండవలెను ఆయా కారక భేదముననుసరించి ఫలితములు చెప్పిన తప్పక జరుగును

స్వక్షేత్ర – త్రికోణ (1–5–9) ఉచ్చ స్థానములలో ఉన్న గ్రహములు, కేంద్రములలో 1–4–7–10 ఉన్న గ్రహములు పరస్పర కారకులగుదురు ఉదాహరణ – కర్కాటకలగ్నమై అందు చంద్ర – గురువులును, చతుర్థమందు శనియు – దశమమందు రవి – కుజులున్నచో వీరు పరస్పర కారకులగుదురు

## గురుగ్రహ శుభదశలు

శ్లో ॥ త్రిదశపతి గురుదశాయాం
మంత్రినృప నృత్య నీతి భిర్విత్తం ।
మానగుణానాం లబ్ధిరతి ప్రతాప
సుహృద్ వివృద్ధాశ్చ
కాంతాసువర్ణ కేసరగజాశ్వ భోగీ
సదాపురుషః । మాంగల్య పేష్టికానాం
లాభో ద్విషతాం వినాశశ్చ ॥
లాభో భవతి నరాణాం ప్రీతిసద్భూమిపైః
సార్థం । జనాతాయా నృపవక్రా త్పుణ్యా
గ్రా ద్గురుజనాచ్చ ధనలాభః ॥

తా – గురుగ్రహము యొక్క – శుభదశ జరుగునపుడు ఈ క్రింది శుభఫలితములు జరుగును శుభదశ అనగా ఆధిపత్య – స్థితులవలన ఆయా లగ్నములకు నిర్ణయించవలయును

ఉన్నత పదవీ ప్రాప్తి – విద్యాసంస్థలు స్థాపించుట, ఆచార్యత్వము, నాట్యము, లాయర్, జడ్జి, మంత్రి పదవులు పొందుట – వ్యాపార వృద్ధి, కుటుంబ వృద్ధి కలుగును స్వాభిమానము, స్వశక్తి ఫలించుట, స్నేహితుల వలన సహాయము, బంగారము, ఏనుగులు, గుర్రములు – ఒంటెలు మొ॥ ప్రాప్తి, వాటివలన ధనలాభం, పుణ్యకర్మలు ఆచరించుట – యోగ నిర్వహణ, శత్రుజయం – గొప్పవారితో పరిచయములు – సత్‌కీర్తి – యాత్రలు చేయుట – గురుకృప సంపదలు వృద్ధి పొందుట జరుగును

శ్లో ॥ వ్యజనాతపత్ర సుమనోవస్త్ర ధ్వజపేయ విశేషతః క్షీణః । గాత్రశ్చయ పృధు శోకం పంగుత్వం గుల్మ కర్ణరోగాశ్చ । పుంస్త్వ వినాశం మేదఃక్షయం నృపతితో భయంసమాప్నోతి ।

తా – గురుగ్రహము పాపి అయినచో ఆ దశయందు ఈ క్రింది పాపఫలితములు సంభవించును

ఉద్యోగ భంగము – అన్న–వస్త్ర లోపము – అనారోగ్యము – కుంటితనము – మూలశంక – చెవిపోటు – పురుషత్వము క్షీణించుట – జ్ఞాపకశక్తి తగ్గిపోవుట – ప్రభుత్వము వలన భయము కలుగును

## శుక్ర శుభదశ

శ్లో ॥ శుక్రదశాయాం విజయః క్ష్మా భవన విలాసశయన పత్నీనాం । మాల్యాచ్ఛాదన భోజనయశః ప్రమోదో నిధి ప్రాప్తః । గేయరతి స్త్రీ సంగోనృపతేః కృషితో ధనస్య సంప్రాప్తిః । జ్ఞానేష్టసౌఖ్య సుహృదాం మన్మధ యోగ్యోపకారణానాం । కులగుణవృద్ధై ర్వాదో యానాసన సంభవాని పాపాని । స్త్రీ నృపతి కృతావశ్యం లోకవిరుద్ధే సహప్రీతిః ॥

తా – శుక్రగ్రహము ఆధిపత్య స్థితిరీత్యా శుభుడైనపుడు అశుభ దశయందు ఈక్రింది శుభఫలితములు జరుగును

సర్వత్రా జయము కలుగును భూమి లాభము గొప్ప అందమైన భవనములు నిర్మించుట – శయన సుఖము – అందమైన భార్య – భోగ జీవితము – సుగంధ ద్రవ్యములు మిక్కిలి వాడుట – పరిశుభ్రత పాటించుట – పుష్పములు – చిత్రకళయందు అభిరుచి – సంగీత విద్వత్ గోష్ఠి – మంచి వస్త్రములు ధరించుట – చక్కటి రుచికరమైన పదార్ధములతో భోజనము – పేరుప్రతిష్టలు – ఆనందము – నిధిలాభము – కోరిన స్త్రీలు లభించుట – ఉన్నత పదవులు పొందుట – వ్యవసాయము వలన – ద్రవ పదార్ధముల వలన ధనలాభము – మిత్రులతో సంతోషం – విచిత్ర వస్తువులు సంపాదించుట – సకల భోగములు – నీతిగా ఉండుట సంభవించును

అదే శుక్రగ్రహము పాపి అయినచో 12 పాప శుక్రదశయందు ఈ క్రింది అశుభఫలితములు జరుగును బంధువులతో విరోధము – చేయు పనులు ఫలించకపోవుట – చెడు స్నేహం ఇతరులను బాధించుట – స్త్రీ మూలకముగా పతనం – ప్రభుత్వ వర్గ వ్యతిరేకత, లోకాచారమునకు వ్యతిరేకముగా ప్రవర్తించుట యందు ఇష్టము కలుగుట సంభవించును

## గురుగ్రహ అష్టకవర్గు ఫలము

శ్లో ॥ జీవస్యోచ్చయశః సుఖార్థనిచయః సౌభాగ్య సౌఖ్యాప్తయో । వాసో వాహనహేమ రబ్ధిరహితధ్వంసక్రియా సిద్ధయః । లాభచ్ఛేద విహీనతా శ్రవణ దృత్పుం స్త్వప్రణాశాదయో । భూభృత్కోప భయం గదైర్వికలతా బంధ్వర్థ పుత్రక్షయః ॥

తా - గురుగ్రహ అష్టకవర్గులో - గురుడు ఏ రాశిలోనైననూ 8 బిందువులు వచ్చిన ఎడల మహాకీర్తి - 7 బిందువులు వచ్చినచో సుఖము - సంపద - 6 బిందువులు వచ్చినచో నగలు - వాహనములు - బంగారము - 5 బిందువులు వచ్చినచో శతృజయం - సర్వకార్యసిద్ధి - 4 బిందువులు వచ్చినచో సామాన్య ఫలితము సంభవించును 3 బిందువులు వచ్చిన కర్ణరోగము - నేత్రవ్యాధులు 2 బిందువులు వచ్చిన ప్రభుత్వ పీడ - 1 బిందువు మాత్రమే వచ్చిన కార్య విఘ్నములు కలుగును శూన్య బిందువు వచ్చిన ఆస్తినష్టం - సంతాన పీడ - బంధు నష్టం - ఒంటరితనం కలుగును

## శుక్రగ్రహ అష్టకవర్గు ఫలము

శ్లో ॥ శుక్రస్యాఖిల భోగవస్త్ర వనితా పుష్పాన్న పానాప్తయోః । భూషామౌక్తిక పౌష్టయః ప్రియవధూలాభిః సుహృత్సంగమః । మధ్యత్వం శుభపాపయోర్జన - పదగ్రామోచ్చ విద్వేషతా । స్థానభ్రంశరుజః కఫశ్చ విషమః సర్వాపదాం సంగమః ॥

తా - శుక్రగ్రహ అష్టకవర్గులో శుక్రగ్రహమునకు వచ్చు బిందువులను బట్టి ఈ క్రింది ఫలితములు జరుగును శుక్రగ్రహము ఏ రాశి యందున్నను 8 బిందువులు వచ్చినచో సకల సంపదలు, ఆభరణములు, స్త్రీ సుఖము - సుగంధ ద్రవ్యలాభం - మృష్టాన్న భోజనములు సంభవించును

7 బిందువులు వచ్చినచో రత్నములు - వాహనములు కళారంగము నందు ఖ్యాతి సంభవించును

6 బిందువులు వచ్చినచో కోరిన స్త్రీలతో సంగమం - 5 బిందువులు వచ్చిన మిత్రులవల్ల లాభం - 4 బిందువులు వచ్చినచో సుఖదుఃఖ లాభం - 4 బిందువులు వచ్చినచో సుఖదుఃఖ సమ్మేళనం - 3 బిందువులు వచ్చిన అధికారులతో శత్రుత్వం - 2 బిందువులు వచ్చినచో స్థానచలనం - స్థిరత్వం లేకపోవుట - వివిధ వృత్తి వ్యాపారములు చేయుట - 1 బిందువు వచ్చిన శ్లేష్మ - మూత్రకోశ రోగములు, బిందు శూన్యమైన అష్టకష్టములు సంభవించును

## అధియోగము

జాతకచక్రము చూడగానే, ఈ జాతకుడు ఆర్ధికముగా ఎటువంటి స్థితిలో నుండును? దరిద్రజాతకుడా? ధనవంతుడా? మరీ గొప్ప కోటీశ్వరుడా? అనునది తెలుసుకొనుటకు 3-4 గొప్ప యోగములున్నవి వాటిలో ఈ "అధియోగము" ఒకటి - దీనిని గూర్చి వివరించగా పరిశీలిద్దాం ఇది కూడా శుభగ్రహములయిన గురు - శుక్ర గ్రహముల వల్లనే సంభవిస్తుంది

శ్లో ॥ లగ్నాదష్టమదాష్టమేయది శుభాః పాపైర్న యుక్తేక్షితాః । మంత్రీ దండపతిః క్షితేరధిపతిః స్త్రీణాం బహూనాంపతిః । దీర్ఘాయుర్గదవర్జితో గతభయో లగ్నాధియోగో భవేత్ । సచ్ఛీలో యవనాధిరాజకధితో జాతఃపుమాన్ సౌఖ్యభాన్ ॥

తా – జాతకుని జన్మలగ్నమునకు 6–8–12 స్థానములలో గురుగ్రహము గాని, శుక్రగ్రహము గాని ఉన్నచో "అధియోగ"ము ఏర్పడును అయితే వీరు పాపులతో చేరిగాని, పాపులచే చూడబడుటగాని జరుగరాదు ఈ యోగము నందు బుట్టినవారు గొప్ప పదవులు పొందుట – ఆరోగ్యము – ఆయుర్దాయం – సకల భోగభాగ్యములు పొందుట జరుగును

స్వక్షేత్ర – ఉచ్ఛ – మిత్రక్షేత్రమందున్న గ్రహములు శుభఫలితములనిచ్చును నీచశత్రుక్షేత్ర గ్రహములు దరిద్రమును, అనారోగ్యమును, దుష్ట స్వభావమును ఇచ్చును

## గురు - శుక్రుల కలయిక

వీరిద్దరూ శుభగ్రహములయినప్పటికీ, కొన్ని లగ్నములకు ఆయా భావములందు మాత్రమే శుభఫలితములిచ్చుచున్నారు

శ్లో ॥ శుక్రస్సురుగురుసహితో భాగ్యగృహస్థో నరాధికంకురుతే । చిరజీవినం సువాక్యం నానావిధ – సౌఖ్యసంపన్నం ॥

తా – గురు, శుక్ర గ్రహములు కలసి భాగ్యస్థానమందున్న శ్రేష్ఠుడు – ఆయుర్దాయవంతుడు – సుఖజీవనము పొందువాడు అగును

గురు – శుక్ర గ్రహములు బాధకులైన లగ్నములకు, ఆ స్థానములో వీరిరువురూ కలసియున్న, ఆ భావమును పాడుచేయుదురు ఉదా కన్యాలగ్నమునకు గురుగ్రహము చతుర్ధ – సప్తమాధిపత్యము పొంది, సప్తమ స్థానము ద్విస్వభావ రాశులకు బాధక స్థానము కావున, గురుగ్రహము బాధక గ్రహమగుచున్నది ఈ సప్తమ స్థానములో గురు – శుక్ర గ్రహములు రెండూ ఉన్నచో, కళత్రభావము చెడును ప్రధమ కళత్ర భంగము – లేదా ద్వితీయ వివాహ యోగము కలుగుటకు సంభావ్యత ఉన్నది సింహలగ్నమునకు చతుర్థ స్థానమందు గురు – శుక్రగ్రహముల కలయిక మాతృసౌఖ్య విహీనుని చేయుచున్నది

గురుడు మేషాది రాశుల ఫలితము

శ్లో ॥ సేనానీ బహువిత్త దారతనయో దాతా సుభృత్యః క్షమీ । తేజోదారగుణాన్విత స్సురగురౌ ఖ్యాతః పుమాన్ కౌజభే । కల్యాంగస్సుఖార్థ మిత్ర తనయః త్యాగీ ప్రియ శ్శైక్రభే । బౌధే భూరిపరిచ్ఛదాత్మ జసుహృత్ సాచివ్యయుక్తః సుఖీ ॥

తా – గురుడు, మేష – వృశ్చిక రాశులయందున్నప్పుడు జన్మించినవారు, సేనాధిపతులు – బహుధన పత్నీ పుత్రులు గలవారు – దాతలు – భార్యా సుఖము గలవారు – ప్రఖ్యాతులు అగుదురు వృషభ – తులారాశులందున్నచో ఆరోగ్యవంతులు – సౌఖ్యవంతులు, ధనవంతులు అగుదురు వీరికి దానగుణముండును ఆకర్షణ శక్తి – ప్రజాభిమానము పొందెదరు మిధున – కన్యల యందున్నచో అనేకమందితో పరిచయము – కుటుంబవృద్ధి కలుగును ఉన్నత పదవులు – మేధస్సు పొందెదరు

శ్లో ॥ చాంద్రేరత్నసుతస్వదార విభవ ప్రజ్ఞాసుఖై రన్వితః । సింహేస్వాద్బల నాయక స్సురగురౌ ప్రోక్తంచ యచ్చంద్రభే । స్వోర్క్షే మాండలికో నరేంద్ర సచివస్సేనాపతి ర్వాధనీ । కుంభేకర్కట వత్సలాని మకరే నీచో ల్పవిత్తః సుఖీ ॥

తా – గురుడు కర్కాటకమందున్నచో జీవన సౌఖ్యము – పుత్ర సంతానము – ధనవృద్ధి కలుగును

గురుడు సింహరాశి యందున్నచో కర్కాటకరాశి యందున్నపుడు ఇచ్చు ఉచ్చ స్థాన శుభఫలితములనే ఇచ్చును ధనుర్మీనములందున్నచో రాజముద్రికాధికారము లేదా గొప్ప ధనికుడు అగును కుంభరాశి యందున్న గురుడు కూడా కర్కాటక రాశికి ఇచ్చు ఉచ్చస్థాన శుభఫలితములనే ఇచ్చును మకరరాశి యందున్నచో నీచుడు, స్వల్ప ధనవంతుడు – సుఖము లేనివాడు అగును

శుక్రుడు మేషాదిరాశుల ఫలితము

శ్లో ॥ పరయువతి రతస్త దర్థవాద్యైః
హృతవిభవః కులపాంశనః కుజర్క్షే।
స్వబలమతిధనో నరేంద్ర పూజ్యః
స్వజనవిభుః ప్రథితో భయస్సితే స్వే ॥

తా – శుక్రగ్రహము కుజక్షేత్రములైన మేష – వృశ్చిక రాశులందున్నచో జాతకుడు పరస్త్రీలోలుడు – పరధనము గ్రహించువాడు – కులభ్రష్టుడు అగును వృషభ – తులా రాశుల యందున్నచో జాతకుడు స్వయంకృషితో అభివృద్ధి పొందువాడు పెద్దలచే గౌరవింపబడువాడు – ఉన్నత పరిచయములు, బంధుకోటలో శ్రేష్ఠుడు – భయము లేనివాడు, యశస్సు గలవాడు అగును

## శుక్రుడు - కర్కాట - సింహ - ధనుర్మీన రాశులందున్న ఫలితము

ద్విభార్యోర్థీ భీరుః ప్రబలమదశోకశ్చ శనిభే
హరౌయోషాప్తార్థః ప్రవర యువతిర్మందతనయః।
గుణైః పూజ్యస్య స్వస్తురగసహితే దానవగురౌ ఘేషు విద్యానాఢ్యో నృపజనిత పూజ్యో తిసుభగః॥

తా – శుక్రగ్రహము చంద్రరాశి అయిన కర్కాటకంలో ఉంటే ఇద్దరు భార్యలు – దుఃఖితుడు అగును సింహరాశిలో ఉంటే శ్రేష్ఠ స్త్రీ సమాగమం – ధనుర్మీనరాశులలో ఉన్నచో పూజ్యుడు – విద్యావేత్త – అందగాడు అగును

శ్రీం

శ్రీమహాగణాధిపతయే నమః

శ్రీరస్తు శుభమస్తు అవిఘ్నమస్తు

శ్లో॥ యా వర్ణపద వాక్యార్థ గద్యపద్యస్వరూపిణీ ।
వాచినర్తయతు క్షిప్రం మేధా దేవీ సరస్వతీ ॥

## శుక్రగ్రహస్తుతి

శ్లో॥ హిమకుంద మృణాళాభం దైత్యానాం పరమం గురుం
సర్వశాస్త్ర ప్రవక్తారం భార్గవం ప్రణమామ్యహమ్ ॥
వేదమంత్రం – "శుక్రంతే అన్యద్యజతంతే అన్యద్విషురూపే"
అహనీ ద్యౌరివాసి । విశ్వాహి మాయా అవసి
స్వధావో భద్రాతే పూషన్నిహ రాతిరస్తు ॥

ఋగ్వేదం – 6-68-1

సామవేదం 1-75, మైత్రాయణేయ సంహిత, కారక బ్రహ్మాణం 8, 4 – తైత్తరీయ ఆరణ్యకం, 1-6-ఐతరేయ బ్రాహ్మణం 1, 19, 9లో ఉన్నది

ఈ శుక్రగ్రహ మంత్రద్రష్ట భరద్వాజుడు ఇది త్రిష్టుప్ చందస్సు

ఇది ఋగ్వేదులు జపించు శుక్ర గ్రహ మంత్రము

యజుర్వేదులు జపించు శుక్రగ్రహమంత్రము వాజసనేయ సంహిత 19, 75 నందు కలదు

★ అన్నాత్ పరిస్రుతో రసం బ్రహ్మణా వ్యాపిబత్ క్షత్రం పయః సోమం ప్రజాపతిః । ఋతేన సత్యమింద్రియం విపానం శుక్రమంధస ఇంద్రస్యేంద్రియమిదం పయో మృతం మధు।

## అధర్వవేద శుక్రగ్రహమంత్రం

★ హిరణ్య వర్ణాశుచయః పావకా, యాసు జాతః సవితాయస్వగ్నిః।
యా అగ్నిం గర్భం దధిరే సువర్ణాః, తాన ఆపః శంస్యోనాభవంతు॥

## శుక్రుని గూర్చి పురాణ గాథలు

శుక్రుడు, భృగువు యొక్క కుమారుడు, అందుచేతనే భార్గవుడని అంటారు తల్లిపేరు ఉశన 'కవి' అన్ననూ శుక్రుడే శుక్రుడు రాక్షసులకు వీరిరువురూ, బృహస్పతి తండ్రియైన

అంగిరసుని వద్ద విద్యాభ్యాసము చేసిరి విద్యాబోధనలో ఇరువురికే వేరువేరుగా చెప్పుటచేత, శుక్రుడు అంగిరసుని విడచిపెట్టి, విద్యాభ్యాసము నిమిత్తము గౌతమ మహర్షిని ప్రార్థించెను సర్వ విద్యలకూ గురువు ఈశ్వరుడేయని ఆ పరమేశ్వరుని సేవించుమని గౌతముడు చెప్పెను వెంటనే శుక్రుడు గోదావరీ తీరమున పరమేశ్వరుని ధ్యానించి ప్రసన్నుని చేసుకొని 'మృతసంజీవనీ' విద్య నేర్చుకొనెను

దేవదానవులకు జరిగిన యుద్ధములో మరణించుచున్న దానవులను శుక్రాచార్యుడు తన సంజీవనీ విద్యచేత బ్రతికించుచుండుటచేత దానవులను దేవతలు గెలువలేక పోవుచుండెడివారు

అంధకాసురుని చంపలేకపోవుట, రాక్షసులను గెలువలేకపోవుట ఈ విషయమంతయూ శివునికి వివరించిరి శుక్రాచార్యుడు మృతసంజీవినీ విద్యచే రాక్షసులను బ్రతికించుచున్నాడని, శివుడు శుక్రుని మింగివేసెను అనంతరము రాక్షసుల పరాజయము, అంధకాసురుని మరణము జరిగాయి శుక్రుడు, పరమశివుని ఉదరము నుండి రుద్రనమక చమకములతో శివుని స్తోత్రము చేయగా శివుడు సంతోషించి తన వీర్యరూపముగా బయటకు శుక్రుని వదలెను బయటకు వచ్చిన భార్గవుడు (శుక్రుడు) నిజరూపమును పొందెను ఆనాటి నుండి శివుని శుక్రముగా బయటకు వచ్చుటచేత, భార్గవునికి "శుక్రుడు" అనుపేరు కలిగెను

శివుని గర్భము నుండి వచ్చుటచేత శివునికి కుమారుడయ్యెను కనుక తనకునూ కుమారుడయ్యెనని పార్వతిపలికి శుక్రుని సుఖవంతునిగా చేయమని శివుని ప్రార్థించెను శివుడంగీకరించి వానిని గొప్ప తేజోవంతునిగా చేసి గ్రహత్వము కల్పించెను - భారతము

ఒకనాడు శుక్రుడు తపస్సు చేసుకొనుచుండగా, తపోభంగము చేయుటకై ఇంద్రుడు తన కుమార్తె అయిన జయంతిని పంపెను శుక్రుడు తన తపస్సు సిద్ధిపొంది బ్రహ్మ నుండి వరములు పొంది అనంతరము జయంతిని స్వీకరించెను శుక్రుని వలన జయంతి యందు "దేవయాని" అను కమార్తె జన్మించెను శుక్రుడు జయంతి భోగించు కాలమున, బృహస్పతి రాక్షసులను మోసగించుటకై శుక్రాచార్యుని రూపమున వచ్చి, వారి రహస్యములను తెలుసుకొనుచుండెను కొద్దికాలమునకు నిజ శుక్రుడు రాక్షసుల వద్దకు రాగా, ఇరువురును ఒక్కలాగనే యుండుటచేత ఎవరు నిజమైన శుక్రాచార్యుడో రాక్షసులు తెలుసుకొనలేకపోయిరి చివరకు మాయాశుక్రుడైన బృహస్పతి అంతర్ధానమయ్యెను, ఈ కథ 'మత్స్యపురాణ'మునందు కలదు కొద్ది బేధముతో దేవీ భాగవతము నందు కూడా కలదు

శుక్రుడు నేర్చిన 'మృతసంజీవనీ' విద్య నేర్చిరమ్మని దేవతలు బృహస్పతి కుమారుడైన కచుని పంపిరి కచుడు శుక్రుని వద్ద శిష్యునిగా చేరి గురుసేవ చేయుచుండెను కచుడు శుక్రుని నుండి విద్య నేర్చుట రాక్షసులకు ఇష్టము లేదు అందుచేత కచుని సంహరించిరి శుక్రుని కుమార్తె అయిన దేవయానికి కచునిపై అనురాగము కలదు ఆమె కోర్కె మేరకు శుక్రుడు మృత సంజీవని చేత కచుని మరల బ్రతికించెను తమ ప్రయత్నము విఫలమగుట సహించలేక రాక్షసులు ఒకనాడు కచుని సంహరించి, కాల్చి భస్మము చేసి ఆ భస్మమును

మద్యములో కలిపి శుక్రునికి ఇచ్చిరి శుక్రుడు జరిగినది తెలియక ఆ మద్యమును తాగెను కచుని రాక తెలియక దేవయాని ఆందోళన చెంది విచారించుచుండగా శుక్రుడు తన యోగ దృష్టి వలన రాక్షస కృత్యమును తెలుసుకొనెను పిమ్మట తన గర్భమందున్న కచుని బ్రతికించి అతనికి 'మృత' సంజీవని ఉపదేశించెను అపుడు కచుడు, శుక్రుని ఉదరము చీల్చి బయటకు వచ్చి, తిరిగి గురువగు శుక్రుని తన మృతసంజీవని చేత బ్రతికించెను తాను మద్యము తాగుటచేత ఇంత జరిగినదని శుక్రుడు మద్యపానము మహాపాతకమని శపించెను

శుక్రునకు తన కుమార్తె అయిన దేవయానిపై మమకారమెక్కువ ఆమె కొరకు ఎంత పని అయినా చేయుచుండెడివాడు వృషపర్వుడను దానవ రాజునకు శర్మిష్ఠ అను కుమార్తె కలదు దేవయాని, శర్మిష్ఠ చెలికత్తెలు ఒకనాడు జలకములాడుటకై కొలను వద్దకు వెళ్ళిరి కొలనుగట్టుపై బట్టలుంచి స్నానము చేయుచుండగా గాలి వీచి బట్టలన్నియు కలగాపులగముగా కలిసిపోయెను శర్మిష్ఠ ముందుగా జలకమాడి, తెలియక దేవయాని వస్త్రములను ధరించెను దేవయాని వచ్చి తన వస్త్రములు శర్మిష్ఠ ధరించుట చూచి "నేను బ్రాహ్మణ బాలిక"ను మా తండ్రి మీ కులగురువు, నీవు విడిచిన వస్త్రములు నేను ధరింతునా, అని కడువుగా మాట్లాడెను అంత శర్మిష్ఠ మా తండ్రి వద్ద, నీ తండ్రి సేవకుడని ఎగతాళి చేసి దేవయానిని నూతిలో పడవేసి వెళ్ళిపోయెను అనంతరము శుక్రుడు, దేవయాని, వృషపరుని నగరమును కోపముతో విడిచిపెట్టిరి దానవరాజు ఈ విషయము తెలుసుకొని శుక్రుని తన నగరము నందేయుండుటకు ప్రార్థించి, దేవయానిని సంతృప్తిపరుచుటకై తన కుమార్తె అయిన శర్మిష్ఠను, దేవయానికి దాసిగా పంపెను చంద్రవంశములోని నహుషుని కుమారుడైన యయాతి, దేవయానిని వివాహము చేసుకొని, ఆమెతో బాటు దాసియైన శర్మిష్ఠను కూడా తీసుకువెళ్ళెను దేవయానికి యదువు, తుర్వసు అను ఇద్దరు కుమారులు కలిగిరి శర్మిష్ఠ కూడా యయాతిని ప్రార్థించి అతని వలన ద్రుహ్యు – అనువు – పురు అను ముగ్గురు కుమారులను పొందెను దేవయాని ఈ విషయము తెలుసుకొని తన భర్త తన దాసితో సంగమించి తన నవమానము చేసెనని కోపగించి భర్తను విడచి తండ్రి వద్దకు చేరెను తన భర్త తన నవమానపరచెనని శుక్రునితో చెప్పి విలపించగా శుక్రుడు పుత్రికావాత్సల్యముచే యయాతిని వృద్ధునిగా కమ్మని శపించెను

యయాతి శాపమునకై విచారించి, శుక్రునితో స్వామీ ఋతుమతియై, పుత్రార్థినియైన భార్యకు ఋతుసాఫల్యము చేయనిచో భ్రూణహత్యా దోషము వచ్చునని ఆ విధముగా కలిసితిని నన్ను అనుగ్రహించమని ప్రార్థించగా శుక్రుడు ప్రసన్నుడై నీ కుమారులలో ఒకడు నీ వృద్ధాప్యమును గ్రహించినచో నీవు యవ్వనవంతుడగుదువని వరమిచ్చెను యయాతి తన పుత్రులను పిలిచి తన జరాభారము తీసుకొమ్మని వేడుకొనెను పురువు తప్ప మిగిలిన వారు తిరస్కరించిరి కోపగించిన యయాతి, యదువంశమువారు రాజ్యమునకయోగ్యులుగను, తుర్వసు వంశము వారు వివేకశూన్యులై కిరాతకులకు రాజులగునట్లుగను, ద్రుహ్యువంశమువారు ముదిమిరాకుండగనే మరణించునట్లుగా శపించెను పురువు ద్వారా అతని యవ్వనమును స్వీకరించి యయాతి అనేక వత్సరములు భోగములను భవించి, చివరకు విరక్తి చెంది పురువునకు

తన యవ్వనమిచ్చి, తాను తన ముసలితనమును గ్రహించి, అతనికి రాజ్యాభిషేకము చేసి, అరణ్యమును చేరి తపస్సు చేసి దేవలోకమునకు వెళ్ళెను

భాగవత పురాణ రీత్యా బలిచక్రవర్తి వద్దకు వామనుడు వచ్చి మూడడుగుల స్థలము నిమ్మని కోరినపుడు, శుక్రాచార్యుడు ఆయడుగ వచ్చినవాడు సామాన్య బ్రాహ్మణుడు కాదని వానికేమియూ నియ్యవద్దని చెప్పెను

"వారి జాక్షులయందు, వైవాహికములందు ప్రాణ విత్త మానభంగమందు అసత్యమాడ వచ్చని శుక్రుడు నీతి బోధించెను కాని బలిచక్రవర్తి ఆడితప్పనని, దానము చేసెదనని ధారపోయుటకు సిద్ధపడెను

శుక్రుడు, బలికుపకారము చేయుటకై ఈగయై నీటిధారపడకుండా జారీకొమ్మున కడ్డపడెను వామనుడు దర్భపుల్లతో కొమ్ములో పొడవగా అది ఒక కంటిలో గుచ్చుకొని కన్ను పోయెను అందుచేతనే శుక్రుని నేత్రమొకటి అంధత్వము పొందెను

కాశీఖండమను గ్రంధరీత్యా శక్రుడు, ప్రియవ్రతుని కుమార్తె అయిన ఊర్జస్వతిని వివాహమాడి, చంద్రుడు, అమర్కుడు, త్వాష్ట్రుడు, ధరాతుడు అను 4గురు కుమారులను కుమార్తె దేవయానిని పొందెను వారిలో చండుడు ప్రహ్లాదునికి విష్ణుద్వేషము కలిగింప ప్రయత్నించి విఫలమయ్యెను అమర్కుడు రాక్షసులకు యాజ్ఞికుడు

తైత్తరీయోపనిషత్ రీత్యా, నక్షత్రములు భగవంతుని శరీరావయవములు అశ్వనీ నక్షత్ర మండలము భగవంతుని ముఖస్వరూపము

"అహోరాత్రే పార్శ్వే నక్షత్రాణి రూపం అశ్వనేవ్యాత్తం అముంమనిషాణ సర్వం మనిషాణ" నక్షత్రములు వాటి అధిపతులయిన గ్రహములను ఆరాధించి శ్రేయస్సు పొందుట మానవులకు కర్తవ్యమగుచున్నది పురాణమందలి గూఢార్థము తెలియవలెను "పరోక్ష ప్రియాహిదేవాః" దేవతలు పరోక్షముగా తెలియజెప్పెదరు వాటిని విజ్ఞులైన వారి నుండి గ్రహించి తరించ వలయును

## శుక్ర నక్షత్రములు

శుక్ర మహాదశ 20 సం॥ములు, ఒక వ్యక్తి ధన, కుటుంబ, సుఖ, సంతోషములతో గొప్పగా వెలుగొందునపుడు, ఆ వ్యక్తికి శుక్రదశ జరుగుచున్నదని జనులు చెప్పుకొనుట మనము వినుచునేయున్నాము

ఇది పూర్ణ సత్యము కాదు కాని శుక్రుడు, సుఖ సంతోషములకు కారకుడు, శుభ గ్రహము అగుచున్నాడు ఈక్రింది నక్షత్రములలో జన్మించిన వారికి పుట్టినపుడు శుక్రదశ ప్రారంభమగును 1-భరణి, ఖగోళములో 3 నక్షత్రములు గుంపు స్త్రీ యోని ఆకారములో కనబడును దీనికి యముడు అధిదేవత మనుష్యగణము ఏనుగుయోని - మధ్యనాడి - కటిరజ్జు ఇది మేషరాశిలో నున్నది రాశ్యాధిపతి కుజుడు దీనిని ఎరీటన్ అందురు
2-పుబ్బ-ఇది మంచంకోళ్ళవలె 4 నక్షత్రముల గుంపు దీనికి అధిదేవత భగుడు మనుష్యగణము

- ఎలుక - మధ్యనాడి - కటిరజ్జు ఇది సింహరాశిలో నున్నది రాశ్యాధిపతి రవి పుబ్బ నక్షత్రమును లియోనిస్ అందురు
3- పూర్వాషాఢ - ఇది విరిగిన మంచకోళ్ళ ఆకారంలో 4 నక్షత్రములు గుంపు దీనికి అధిపతి వరుణుడు మనుష్యగణము - కోతి - మధ్యనాడి - కటిరజ్జు ఇది ధనుస్సు రాశిలో నున్నది రాశ్యాధిపతి గురుడు దీనిని సాగెట్టరీ అందురు

## శరీరంలో శుక్రుని ఆధిపత్యం

మానవ శరీరంలో నేత్రములు - మూత్రపిండములు, ఉంగరాల జుట్టు, నాలుక, చర్మము, జననేంద్రియములు, గొంతుక, ముఖము, వీర్యము, శరీరంలోని నీరు, ఇవన్నీ శుక్రగ్రహం యొక్క అధీనంలో ఉంటాయి

## శుక్రగ్రహం

శుక్రుడు, రాక్షసులకు గురువు భూమి నుండి పుట్టిన 8 తెల్లని గుర్రములు పూన్చిన రథముపై, తెల్లని జెండా ఎగురుతుండగా చతుర్భుజుడైన తెల్లనివాడైన శుక్రుడు తెల్లని వస్త్రములు ధరించి ఒక చేతిలో జపమాల, రెండవ చేతిలో దండము, మూడవ చేతిలో కమండలము, నాల్గవ చేయి వరదహస్తముద్రతో రథము అధిరోహించి ఉండును

## శుక్రగ్రహ రాశులు

1- వృషభం - దీనికి అధిపతి శుక్రుడు ఇందు కృత్తిక 2-3-4 పాదములు రోహిణి 1-2-3-4 పాదములు మృగశిర 1-2 పాదములు కలవు ఇది శుక్రునికి స్వక్షేత్ర రాశి ఇది స్థిరరాశి, కాలపురుషుని ముఖము సౌమ్యము రాత్రిబలముకలది దక్షిణదిశకధిపతి తెలుపురంగు -ఎద్దు ఆకారం - స్త్రీరాశి - వైశ్యజాతి - భూమితత్వం - అధిక శబ్దం - చతుష్పదరాశి - పృష్ఠోదయరాశి
2 - తులారాశి - దీనికి అధిపతి శుక్రుడు ఇందు చిత్త 3-4 పాదములు స్వాతి 1-2-3-4 పాదములు, విశాఖ 1-2-3 పాదములు కలవు ఇది శుక్రునికి మూల త్రికోణరాశి కాలపురుషుని నాభి -క్రూరం - పగలు బలం - చరరాశి - పశ్చిమదిశకధిపతి - నీలవర్ణం పురుషరాశి - పురుషాకారం - శూద్రజాతి - వాయుతత్వం - నిశ్శబ్దం - నరరాశి - శీర్షోదయరాశి

## శుక్రునకు ఉచ్ఛ - నీచలు

శుక్రుడు మీనరాశిలో 27 భాగంలో పరమోచ్ఛ కన్యలో 27 డిగ్రీలలో పరమనీచ తులారాశిలో 10 డిగ్రీలు మూలత్రికోణం మిగిలిన 20 డిగ్రీలు స్వక్షేత్రం

## శుక్రగ్రహ కారకత్వములు

శ్లో॥ శ్వేతచ్ఛత్ర సుచామరాంబర వివాహయద్వి
పాత్ స్త్రీద్విజా । సౌమ్య శ్వేత కళత్ర కాముక
సుఖ హ్రస్వామ్ల పుష్పాజ్ఞకాః । కీర్తిర్యౌవనగర్వ
యాన రజతాగ్నేయ ప్రియ క్షారకాః । తిర్యగ్ఘ
క్కష పక్షరాజ సదృఢా ముక్తా యజుర్వైశ్యకాః ॥ ఉత్తరకాలామృతం - 44

శ్లో॥ సౌందర్యక్రియ విక్రయాస్సరససల్లాపోజన
స్థానకం । మాతంగసురగో వచిత్ర కవితా
నృత్తం చ మద్యం వయః ।
గీతం భోగ కళత్ర సౌఖ్యమణయో హాస్యప్రియ ఖేచరః ।
భృత్యో భాగ్య విచిత్ర కాంతి సుకుమారా రాజ్యగంధప్రజః ఉ॥కా॥ 45

శ్లో॥ వీణావేణు వినోద చారుగమనాష్టైశ్వర్య
చార్వంగతా । స్వల్పాహార వసంత భూషణ
బహుస్త్రీ సంగ్రహ ప్రాఙ్ముఖాః । నేత్రం సత్య
వచః కళానిపుణతా రేతో జలక్రీడతా
గాంభీర్యాతిశయస్తతశ్చతురతావాద్యం నాటాలంకృతిః ॥

శ్లో॥ కేళీ లోలక ఖండదేహ మదన ప్రాధాన్య
సన్మాన్యతా । యుక్తశ్వేత వటప్రియో
భరతశాస్త్రం రాజముద్రాప్రభుః గౌరీశ్రీ
మాతృకః కావ్యాదౌరచనా ప్రబంధచరితః స్యాన్నీలకేశ శ్శుభమ్ ॥

శ్లో॥ గుహ్యం మూత్రసునాగలోక సరణే
తత్రాపరాహ్ణం తథా । జామిత్ర స్థలజం
రహస్యముదితం సర్వం వదేత్ భార్గవాత్ ॥

తా- తెల్లటి గొడుడు - వింజామర - తెల్లని వస్త్రములు - వివాహము - సంపాదన - రెండు కాళ్ళ ప్రాణులు - స్త్రీ - బ్రాహ్మణులు - సౌమ్యురాలయిన తెల్లని రంగు గల భార్య - శరీర సుఖం - పొట్టితనము - పులుపు - పువ్వులు - ఆజ్ఞ - కీర్తి - యౌవనం - గర్వం - వాహనములు - వెండి - ఆగ్నేయదిశయందిష్టము - వగరు - వెనుకచూపు - బహుళపక్షము - రాజరీవి దృఢత్వము - ముత్యములు - యజుర్వేదము - వైశ్యులు - సౌందర్యము - కొనుట, అమ్మట - సరస సల్లాపములు - నీటివనరులు - ఏనుగు గుఱ్ఱములు - విచిత్ర వస్తువులు - కవిత్వము - నాట్యము - సంగీతము - మద్యము - పాలు - సౌఖ్యము - భార్యాసుఖము - విలువైన వజ్రములు - మణులు - హాస్యప్రియత్వము - నీటి యందు, విమానములందు ప్రయాణము - సేవకులు - కోమలత్వము - రాజ్యము - సుగంధము - మాలికలు - వీణ - వేణువు - వినోదము - అందమైన నడక - 8 విధములైన అష్టైశ్వర్యములు

- ఫలహారములు - వసంత ఋతువు - బంగారు ఆభరణములు - వివిధ స్త్రీ సంగమములు - తూర్పు దిశ - కళ్ళు - నిజము పలుకుట - కళానైపుణ్యము - రేతస్సు - జలకేళి - గాంభీర్యము - అతిశయము - వాద్యనైపుణ్య నాటకరంగము - శృంగారము - అలంకరణ - తెల్లని బట్టల యందు ఇష్టము - రాజముద్ర, ప్రభుత్వాధికారము - పరాశక్తి, లక్ష్మీదేవి వీరి యందు ఇష్టము స్వల్పమయిన రతికేళి వలన అలయుట కావ్యములు రచించుట - ప్రబంధములందు పాండిత్యము - నల్లని జుట్టు - శుభకరములు - మూత్రద్వారము - నాగలోక గమనము - మధ్యాహ్నము - సప్తమ స్థాన ఫలములు ఇవన్నియూ శుక్రగ్రహ కారకత్వములు

## శుక్రదశా ఫలితములు

శ్లో॥ శౌక్రీ శ్రేష్ఠదశాకరోతి సుఖసౌభాగ్యోచ్ఛ్రయాం -
దోళికా । ష్టైశ్వర్యాయుత ధర్మబుద్ధి కనకా
రామాశ్వ గీతోత్వవాన్ - శౌక్రీ పాపదశా
కళత్రభయ కృన్నీచార్థ హానిప్రదానత్యంత
స్తేయ మహా ప్రదోషవిపుల స్త్రీ వర్గ రోగోద్భవాన్ ॥

తా॥ శుక్రుడు ఉచ్చ స్వక్షేత్ర, మిత్రక్షేత్రములలోనూ 1-4-7-10 కేంద్రములలోనూ, 5-కోణస్థాలములలనూ, లగ్నాదిగా నున్నపుడు ఈ క్రింది శుభఫలితముల నిచ్చును

సుఖము - అష్టైశ్వర్యములు - ధర్మబుద్ధి, బంగారము - భవనములు - గుర్రములు, వాహనములు - ఉత్సవ ములు - సంగీత, నృత్య సమ్మేళనములు మొ॥గు శుక్రగ్రహ సంబంధ శుభ కారకత్వ ఫలితములనిచ్చును

శుక్రుడు 6-8-12 రాశులలోనూ నీచ, శతృక్షేత్రములందున్నపుడు ఈక్రింది చెడు ఫలితములనిచ్చును భార్యానాశనము, ధననష్టం, దొంగతనము, స్త్రీరోగములు, మూత్రసంబంధ వ్యాధులు, మహాదోషములనిచ్చును

## శుక్రగ్రహ లక్షణములు

శుక్రుడు బ్రాహ్మణ జాతి గ్రహం - రజోగుణం - స్త్రీగ్రహం - తెల్లనివాడు - మంత్రి - అధిదేవత శచీదేవి - ప్రత్యధి దేవత ఇంద్రుడు - ఆగ్నేయమునకధిపతి - జనబాహుళ్యమునకు అధిపతి - బ్రాహ్మణులకు అధిపతి - సొగసైన శరీరం - అందమైన నేత్రములు - వాత, శ్లేష్మతత్వముల మిశ్రమ స్వభావం - నల్లని తల వెంట్రుకలు - సుఖమందు కోరిక - శయన గృహమునకధిపతి బృహవస్త్రదారి - ద్రవ్యం వజ్రములు - ముత్యములు పుల్లని రుచి

శుక్రునకు శని - బుధులు, మిత్రులు - రవి, చంద్ర, కుజ, గురులు, శత్రువులు, మధ్యాహ్నకాలము ఇష్టము, ఇంద్రియమందు బలంకలవాడు, మధ్య వయసువాడు

## 12 స్థానములలో శుక్రగ్రహ ఫలితములు

1 శుక్రుడు లగ్నమందున్న గణిత శాస్త్రవేత్త భార్యయందు ప్రేమకలవాడు, వస్త్రాంకారములయందు, ప్రీతి, రూపలావణ్యవంతుడు – ధనవంతుడు – పచ్చని శరీర కాంతి కలవాడు – చిరకాలము జీవించువాడు అగును

ఈ శుక్రుడు పాపగ్రహములతో కలిసిననూ చూడబడిననూ, నీచస్థానమున నున్ననూ జాతకుడు చోరుడు, మోసకారి, వాత – శ్లేష్మ వ్యాధి పీడితుడూ యగును గర్గిఋషిమతమున లగ్నమున, శుక్రుడున్ననూ, లేక లగ్నప్తమమున శుక్రుడున్ననూ జాతకుడు కటి, గుహ్యా ప్రదేశములందు కురుపులు, శస్త్ర చికిత్స లేదా పుట్టుమచ్చలు కలవాడగును – ఇది గర్గి మతము

2. లగ్నము నుండి 2వ స్థానములో శుక్రుడన్న జాతకుడు ధనవంతుడు, సత్యవాది, అందమైన నేత్రములు కలవాడు, దయకలవాడు, పరోపకారి, 32 సం॥ నందు ఉత్తమ స్త్రీ లాభముపొందువాడు అగును స్త్రీ ధనం పొందును

శుక్రుడు పాపగ్రహసంబంధము కలవాడైనచో నేత్రపీడ, చంద్రునితో కలసిచో రేచీకటి కలవాడు – ధననష్టమును పొందువాడు కుటుంబము లేనివాడు అగును

3 లగ్నము నుండి 3వ స్థానములో శుక్రుడున్న జాతకుడు అతిలోభి – ఎక్కువమంది సోదరులు కలవాడు – సంకల్ప సిద్ధి పొందువాడు – ధనవృద్ధి పొందువాడు – అగును తృతీయ భావము బలముగా యుండి శుక్రుడు తన స్వక్షేత్రమూ తన ఉచ్చరాశి యందున్నను భ్రాతృవృద్ధి కలుగును భావాధిపతి 6–8–12లో నున్న, పాపగ్రహములతో కలిసినా సోదరులు మరణింతురు

4 లగ్నమునుండి 4వ స్థానములో శుక్రుడున్న జాతకుడు – రూపవంతుడు – సంగీతగాయకుడు బుద్ధిమంతుడు – 30వ సం॥ వాహనయోగము పొందువాడు, సోదర సుఖము కలవాడు అగును క్షమాహృదయము కలిగియుండును భావాధిపతి బలయుతుడయిన జాతకుడు గొప్ప వాహనములు, స్కూటర్లు, కార్లు కలవాడు – ధన కనక వస్తు వాహనవంతుడుయగును భావాధిపతి పాపగ్రహముతో కలిసిననూ, శతృనీచక్షేత్రములలో యున్ననూ, లేక బలహీనుడయిననూ జాతకుడు ధన, వాహనములు లేనివాడగును, జాతకుని తల్లి మనశ్శాంతి లేనిదగును పరస్త్రీ సంగమము కలవాడగును

5. లగ్నమునుండి 5వ స్థానములో శుక్రుడున్న జాతకుడు విజ్ఞాని, మంత్రి లేక సైన్యమునందు గొప్ప పదవి పొందువాడును సదా యవ్వనవతి అందమైన భార్యను పొందును మంచితనముండును ప్రభుత్వముచే గౌరవ సన్మానములు పొందును శుక్రుడు పాపగ్రహములతో కలిసినా, పాపక్షేత్రమున యున్ననూ, తన నీచస్థానమున యున్ననూ జాతకుడు మందబుద్ధియగును

6 లగ్నము నుండి 6 వ స్థానములో శుక్రుడున్న జాతకుడు గొప్ప పేరు ప్రఖ్యాతులు పొందువారు – పుత్రపేత్ర వృద్ధి కలవాడు – అవసర ఖర్చులు చేయువాడు – మాయావాదములు చేయువాడు – రోగవంతుడు అగును భావాధిపతి పాపితో కలిసినా నీచయందున్ననూ లేక

చంద్రునితో కలిసిననూ బంధునష్టము పుత్ర సంతానము లేకపోవుట, శత్రునాశకుడు అగును

7 లగ్నములనుండి 7వ స్థానములో శుక్రుడున్న జాతకుడు, అతికాముడు, భగచుంబనాప్రియుడు, బహుధనవంతుడు అన్య స్త్రీలయందు ఆసక్తికలవాడు – వాహనవంతుడు – రసికుడు –సంగీతవేత్త – సకలకార్యకుశలుడు – పుత్రవంతుడు, భోగియగును శుక్రుడు పాపగ్రహముతో యున్ననూ, పాపగ్రహక్షేత్రమున యున్ననూ, నీచస్థానమునయున్ననూ, భార్యావియోగము – రెండవ వివాహము బహుపాపగ్రహములు శుక్రునితో యున్న బహువివాహములు పొందువాడు – అగును ఇట్టియోగములో జాతకునకు పుత్రసంతానముండదు శుక్రుడు శుభగ్రహముతో కలిసిననూ లేక తన స్వక్షేత్ర ఉచ్చక్షేత్రముల యందున్ననూ (వృషభం – తుల – మీనం) భార్యామూలమున బహుధన ప్రాప్తి –భార్యామూలమున కీర్తి – పొందువాడగును

8 లగ్నమునుండి 8వ స్థానములో శుక్రుడున్న జాతకుడు సుఖవంతుడు, 4వ సం॥ తల్లికి గండం, అర్ధాయుషు కలవాడు – రోగపీడితుడు, త్యాగనిరతి కలిగిన భార్య లభించును అసంతుష్ట జీవితము గడుపును శుక్రుడు శుభక్షేత్రమందున్న దీర్ఘాయుర్దాయము పొందును పాపగ్రహ సంబంధమున్న అల్పాయువు

## కాశ్యప సంహిత

శ్లో॥ తృష్ణాతః సుఖరోగాచ్చ దంతదోషాత్త్రి దోషతంః
విషూచ్యా వనత్వేన భుజంగాత్ విష భక్షణాత్।
యాతయా విషకంఠేన సురతోత్థప్రరోపతః
బహుదుఃఖాత్ భవేత్ మృత్యుః మృత్యుభవగతేసతి ॥

తా – మేషరాశి అష్టమమై అందు శుక్రుడున్నచో తుష్ణాపీడితుడగును వృషభము అష్టమమై అందు శుక్రుడున్న సుఖరోగ పీడితుడగును మిధున రాశి అష్టమమై అందు శుక్రుడున్న దంతరోగి, కర్కాటకము అష్టమమై అందు శుక్రుడున్న వాతపెత్తశ్లేష్మ త్రిదోషముచేత రోగపీడితుడగును సింహము అష్టమమై అందు శుక్రుడున్న మశూచి చేత మరణము పొందును కన్యారాశి అష్టమమై అందు శుక్రుడున్న మృతములచేత, తుల అష్టమమై అందు శుక్రుడున్న సర్పములచేత, వృశ్చికము అష్టమమై అందు శుక్రుడున్న విష భక్షణ చేతను, దనుస్సు అష్టమమై అందు శుక్రుడున్న క్రిమికీటకములచేతనూ, మకరము అష్టమమై అందు శుక్రుడున్న విష ప్రయోగము లేదా (శస్త్ర చికిత్స అనంతరము) కుంభము అష్టమమై అందు శుక్రుడున్న అతికామ భోగము చేతనూ, మీనము అష్టమమై అందు శుక్రుడున్న అతి బాధలతోనూ మరణమును పొందును

9 లగ్నమునుండి 9వ స్థానములో శుక్రుడున్న జాతకుడు, ధార్మికుడు – తపస్వి – సత్కర్మచేయువాడు – పాదములందు పుట్టుమచ్చలు, శుభ చిహ్నములు కలవాడు – బహు భోగలాలసుడు– పుత్రువంతుడు – తండ్రి దీర్ఘాయుర్దాయవంతుడు అగును శుక్రుడు పాప

గ్రహముతో యున్ననూ పాపగ్రహముతో కలసిననూ పాప క్షేత్రమందున్ననూ జాతకుని తండ్రి బాల్యము నందే మరణించును నీచ గృహమయిన కన్యయందున్న భాగ్యనాశనము పొందును సంగమము కూడని వయసు గల స్త్రీతో రమించును శుక్రుడు శుభగ్రహములతో యుతి పొందిననూ - శుభగ్రహముచే చూడబడిననూ, మీనమందున్ననూ జాతకుడు మహాభోగి - ధనవంతుడు అగును శుక్రుడు భాగ్యస్థానమందుండె చతుర్థ - సప్తమాధిపతులతో శుభ సంబంధమున్నచో జాతకుడు బహు భోగములను అనుభవించును విశేష వివాహములు, విదేశీ కార్లు ఉండును తరచూ విమాన ప్రయాణములు చేయును ఎక్కువ వాహనములుండును

ఉదాహరణ - 1 జయలలిత

జననం 1948-2-24, మ॥ 2-34 విదేశీకార్లు - పేరు ప్రఖ్యాతులు - భోగజీవితం పొందిన జాతకం




చతుర్థాధిపతి భాగ్యంలో స్థితి కారకుడయిన శుక్రుడు దశమంలో ఉచ్చస్థితి సప్తమాధిపతి సప్తమంలో స్వక్షేత్రస్థితి గొప్ప వాహనయోగం

ఉదాహరణ - 2 బి వి రామన్, ప్రపంచ ప్రఖ్యాతి జ్యోతిష శాస్త్ర పండితులు అనేకసార్లు విదేశీ పర్యటనలు చేసి విదేశాలలో గౌరవ డాక్టరేట్లు పొందారు జననం 1912-8-8 రాత్రి 7-42 ని॥లకు




చతుర్థ - భాగ్యాధిపతి అయిన శుక్రుని సప్తమ స్థితి గొప్ప వాహన యోగాన్నిచ్చాయి

ఉదాహరణ -3 సంజయ్‌గాంధి, మారుతికార్ల ఫ్యాక్టరీ స్థాపకుడు

జననం 1946-12-14

రా
(4)
(7) శ
రాశి
లగ్నం (1)
చ
కు
శు
(10)
గు
ర
బు కే

భాగ్యస్థానమందు చతుర్థాధిపతితో శుక్రస్థితి భాగ్యాధిపతి లాభంలో అష్టమాధిపతితో స్థితి 1947 నుండి 20 సం॥లు 1967 వరకు, 20 సం॥ల శుక్రదశలో విదేశీ నివాసం మంచి భోగజీవితం అనంతరం మారుతి కార్ల ఫ్యాక్టరీ స్థాపించడం జరిగింది అష్టమ చంద్రునివల్ల, ఆయుర్ధాయం లేక చంద్రదశ చివరిలో 1980-6-23 మరణం ప్రాప్తించింది

ఉదాహరణ - 4 రజనీశ్

జననం 1931-12-11 ఈయన 119 రోల్స్‌రాయల్స్ కార్లు వాడిన యోగి

లగ్నం
(1)
రా
(10)
గు
రాశి
చ శు
(7) శ బు
ర కు
(4)
కే

ఇది ఒక అసాధారణమయిన జాతకం - వృషభలగ్నం లగ్నాధిపతి శుక్రుడు అష్టమస్థితి చతుర్థాధిపతి వాహనాధిపతి అయిన రవి సప్తమస్థితి సుఖ భాగ్య రాజ్యాధిపతులు లగ్నాధిపతితో కలిసియున్నారు లాభాధిపతి ధనస్థానంలో ఉచ్చ ధనకారకుడైన గురుడే లాభాధిపతి అయినాడు గొప్ప జాతకం అష్టమం, రహస్య - కుండలినీ ప్రదీప్తికి స్థానమైనది దీనికి శుభత్వం పట్టింది

10 లగ్నమునుండి 10వ స్థానములో శుక్రుడున్న జాతకుడు, ధైర్యవంతుడు - బుధ, గురు, చంద్రులతో కలిసిన బహువాహనవంతుడు, యజ్ఞములు చేయువాడు అగును మరణానంతరము కూడా కీర్తికలవాడగును శుక్రునకు పాపగ్రహ సంబంధములున్న పనులలో విఘ్నములు కలిగి పరాజయమును పొందును

11 లగ్నమునుండి 11వ స్థానములో శుక్రుడున్న జాతకుడు, ఉన్నత విద్యావేత్త - ధనవంతుడు అగును భూ వసతి కలవాడు దయకలవాడు - శుభగ్రహముతో కలసిన కలసినచో

జాతకుడు అనేక వాహనములు కలవాడు అగును పాపగ్రహ సంబంధమున్న జాతకుడు అక్రమమార్గములో సంపాదించును శుభగ్రహముతో కలిసిన న్యాయమార్గములో ధన సంపాదన చేయును

12 లగ్నము నుండి 12వ స్థానములో శుక్రుడున్న జాతకుడు దరిద్రుడగును పాపగ్రహములతో శుక్రుడు కలసిన నీచస్త్రీలతో రమించును శుభగ్రహముతో కలిసిన గొప్ప ధనవంతుడగును

భావార్థ రత్నాకరమందు - వ్యయశుక్రుడు కూడా యోగమిచ్చునని తెలుపబడినది

'వ్యవస్థతస్య శుక్రస్య తధాయోగం వదంతిహి"

"ఉత్తర కాలామృత" మందు "శుక్రోద్వాదశ సంస్థితశ్చ శుభదోమందాం శరాశ్యాం వినా" రాశి యందు 12లో నున్ననూ అంశలో శుక్రుడు మకర కుంభనవాంశలందు లేనిచో శుభఫలితములనిచ్చును

## శుక్రుడు మేషాది రాశులందున్న ఫలితములు

శ్లో॥ పరయువతి రతస్తదర్థవాద్యైః
హృతవిభవః కులపాంశనః కుజర్క్షే ।
స్వబలమతిధనో నరేంద్రపూజ్యః
స్వజనవిభుః ప్రథితో భయస్వితస్వే ॥ బృహజ్జాతకం - 18 - 14

తా - శుక్రుడు మేష - వృశ్చికములందుండగా జన్మించిన జాతకుడు పరస్త్రీరతుడు, వారి నిమిత్తము ధననష్టము చేయువాడు, కులములో అపకీర్తి పొందువాడు అగును

శుక్రుడు తన స్వక్షేత్రములైన వృషభ - తుల లగ్నమందున్న జాతకుడు తన బుద్ధివైభవముచేత గొప్ప ధనవంతుడగును గొప్పవారితో స్నేహము సన్మానము పొందును ప్రసిద్ధవ్యక్తి యగును

ఉదాహరణ - 5 ప్రిన్సెస్ డయానా

జననం 1961 - 7- 1 ధనిష్ఠా నక్షత్రం - కుంభరాశి - వృశ్చికలగ్నం



డయానా జాతకములో, శుక్రుడు సప్తమంలో స్వక్షేత్రంలో ధన పంచమాధిపతి అయిన శుక్రగ్రహమయిన గురుని దృష్టి పొందియున్నాడు ఏ పాపగ్రహముతో కలయకుండా వున్నాడు ఈమె తన స్వీయ సౌందర్యానురాగములతో బ్రిటీష్ యువరాజు ప్రిన్స్ చార్లెస్‌ను 1981-7-29న వివాహమాడి గొప్ప ధనవంతురాలు, ప్రపంచ ప్రఖ్యాత స్త్రీ అయినది శని దశ శన్యంతరంలో 1997-8-31న పారిస్ నగరంలో కారు ప్రమాదంలో మరణించింది

శ్లో॥ నృపకృత్య కరోర్ధ వాన్కలావిత్
మిధునేషష్ఠ గతేతినీచకర్మా
రవిజర్యగతే సురారి పూజ్యే
సుభగః స్త్రీ విజితో రతః కునార్యామ్ ।

తా- శుక్రుడు మిధునమందుండగా జన్మించిన జాతకుడు, ప్రభుత్వోద్యోగము చేయువాడు, ధనవంతుడు, సంగీత వాద్యములందు నేర్పరి అగును శుక్రుడు కన్య యందున్నచో జాతకుడు నీచ కర్మలనాచరించును శనిక్షేత్రములైన మకర కుంభరాశులయందు శుక్రుడున్నచో ప్రజానురాగము పొందువాడు - పరస్త్రీరతుడు - అగును

శో॥ ద్విభార్యో ర్ధీ భీరుః ప్రబలమదశేకశ్చ శశిభే
హరాయోషాప్తార్ధః ప్రవరయురతిర్మంద తనయః ।
గుణైః పూజ్యస్స్య స్వస్తురగ సహితే దానవగురౌ
శేషు విద్యానాఢ్యో నృపజనిత పూజ్యోతిసుభగః ॥

తా - శుక్రుడు కర్కాటక రాశిలో వుంటే ఇద్దరు భార్యలు - దుఃఖ జీవితము పొందువాడు అగును సింహంలో ఉంటే ఉన్నత స్త్రీ సంగమం దనర్మీనరాశుల్లో శుక్రుడున్నచో, విద్యావేత్త - సుందరుడు అగును

## శుక్రగ్రహ శుభ ఫలితములు పొందిన జాతకులు

ఉదాహరణ - 6 శ్రీకృష్ణపరమాత్మ జననం క్రీస్తు పూర్వం 3228-7-19 శ్రావణ శుద్ధ అష్టమీ రోహిణీ నక్షత్రం, అర్ధరాత్రి వృషభలగ్నంలో, పురాణపురుషుడు అవతరించాడు జననకాల చంద్రదశాశేషం 4-2-2 రో॥



శుక్రుని స్వక్షేత్రమయిన స్థిర లగ్నంలో వృషభంలో చంద్రుడు ఉచ్ఛస్థితిని పొందియుండగా, సౌందర్యవంతుడయిన శ్రీకృష్ణభగవానుడు అవతరించాడు వాక్ స్థానాధిపతి, బుద్ధి స్థానాధిపతి అయిన బుధుడు పంచమ స్థానంలో ఉచ్ఛస్థితి పొంది పాపగ్రహ స్పర్శ లేకపోవుట చేత మధురభాషి, జగత్తుకే గీతోపదేశ కర్త అయినాడు మాటలయందు సమ్మోహనశక్తి రాజకీయ చతురత కలిగాయి. కళత్రకారకుడయిన శుక్రుడు సప్తమాధిపతి అయిన కుజునితోనూ, రాహువుతోనూ కలియుటచేత అనేకమంది భార్యలను పొందాడు శుక్ర కారకత్వములైన జతక్రీడలు, శమంతకమణిని పొందడం జరిగింది సంగీత గానలోలుడైనాడు, వేణుగానము చేత ఆనందలోకాలు సాక్షాత్కరింపచేసి, పశువులను కూడా పరవశింపజేశాడు శుభ్రములైన వస్త్రములు, పరిమళ భరిత సుగంధమాలలు, బంగారు ఆభరణములు శ్రేష్టములైన గుర్రములు పూన్చిన రధములు అనేక విశేష భోగములను అనుభవించాడు

రవి - గురునితో కలసి స్వక్షేత్రములో శుక్రుని నక్షత్రమయిన పుబ్బ యందుండుటచేత 64 కళలయందు నేర్పరి అయినాడు గొప్ప శృంగారవేత్త వృషభలగ్నానికి ఈదహుడైన కుజుడు 3లో ఉచ్చను పొందుట చేత 11 సం॥ల వరకు బాలారిష్టముచేత అనేక బాధలు పొంది వాటిలో విజయమును సాధించాడు

సాధారణ మానవులకు ఇన్ని అసాధారణ లక్షణములుండుట అసంభవము శ్రీకృష్ణపరమాత్మ అవతారపురుషుడు, రాజకీయ దురంధరుడు, తత్త్వవేత్త, యోగీశ్వరుడు, దుష్టశిక్షకుడు, శిష్టరక్షకుడు, స్నేహితుడైన దరిద్ర కుచేలునికి అష్టైశ్వర్యములిచ్చిన స్నేహశీలి

శ్రీకృష్ణుని జాతకములో లగ్నము, చంద్రుడు, రవి మూడు చాలా బలముగా ఉన్నాయి ఆత్మ కారకుడయిన రవి, జ్ఞాన కారకుడైన గురునితో కలసి 10వ స్థానమును, కర్మస్థానమును చూచుట వలన జాతకుడు మనస్సును నూరుశాతం అదుపులో నుంచుకొన్న మహాపురుషుడు యోగకారకుడైన శని వర్గోత్తమమును దిగ్బలమును పొందాడు అందుచేతనే ఈ ఆయుష్కారకుడైన శనిగ్రహమువల్లనే శ్రీకృష్ణపరమాత్మ 125 సం॥ల పరిపూర్ణ దీర్ఘకాలము జీవించాడు

ఉదాహరణ - 7 శ్రీ ఎన్ టి రామారావు

జననం 1923-5-28 సా॥ 4-43 ని॥లకు 16 15N 81 12E

| | | |
|---|---|---|
| ర బు కు | ⑦ శు | కే |
| ⑩ | రాశి | ④ |
| రా శ | లగ్నం గు చ ① | |

తులాలగ్నం జననకాల రాహు దశాశేషం 1 50 రో॥ ఈ జాతకుడు శుక్రగ్రహ కారకత్వములైన కళారంగములో నటుడుగా కోట్లాది ప్రజలను రంజింపచేసి వారి అభిమానాన్ని చూరగొన్న మహాపురుషుడు

సాక్షాత్తు శుక్రలగ్నమయిన తులాలగ్నముననే జన్మించాడు లగ్నాధిపతి అయిన శుక్రుడు సప్తమ దృష్టిచేత లగ్నమును చూస్తున్నాడు లగ్నములో శుభగ్రహములైన గురు – చంద్రుడు ఒకే డిగ్రీలో కలిసియున్నారు గురుడు 18–31' డిగ్రీలు చంద్రుడు 18–57' డిగ్రీలు ఈ విధముగా ఒకే డిగ్రీలో గురుచంద్రులు శుభరాశులలో కేంద్రస్థానములో నున్నచో, అట్టి జాతకుడు ఎటువంటి కుటుంబములో జన్మించిననూ కుబేరుని వంటి ధనవంతుడగును మరణాంతరమూ కూడా కీర్తివంతుడగును

ఈ జాతకము, జ్యోతిషశాస్త్ర పండితులకు తులాలగ్న జాతకములలో చూడముచ్చటయిన జాతకము

1983–10–28 నుంచి ప్రారంభమయిన శుక్ర మహాదశ విశేషయోగము నిచ్చినది రాజ్యాధికారము, ప్రజాభిమానము, విశేష కీర్తి ప్రతిష్ఠలు ప్రజాపయోగ కార్యనిర్వహణా సమర్ధతా మొ॥ ఎన్నో శుభ కారకత్వ ఫలితముల నిచ్చినది విశేషమేమనగా ఈ జాతకుడు, శ్రీకృష్ణ పాత్రధారిగా, ఆంధ్రప్రజల హృదయములలో చిరంజీవిగా స్థానము నందుట, ఆ సౌందర్యము, ఆ భ్రూవిలాసము, ఆ నటనా చాతుర్యము, ఆ నిష్కపటిత్వమూ, ఆ క్రమశిక్షణా మొ॥ ఎన్నో సుగుణములు శుక్రగ్రహ కరనేత్వములే 1982–3–29న తెలుగుదేశం పార్టీ స్థాపన

ఈ జాతకునకు ఆత్మకారకుడు 'శని' అయినాడు జైమిని సిద్ధాంతరీత్యా "ప్రసిద్ధ కర్మా జీవ–శ్శనేః" అని సూత్రము అనగా, శని ఆత్మకారకుడయిన శక్తి ప్రసిద్ధ పురుషుడగును తులాలగ్నమునకు శని పరమ యోగ కారకుడై పరమ యోగ స్థానములో 12లో వ్యయ మందున్నాడు ఇంతకంటే యోగస్థానము ఆలగ్నమునకు లేదు ఈ దశలో విశేషయోగం 1940–10–28 నుంచి 1959–10–28 వరకు శని దశ జరిగింది శ్రీ ఎన్టీఆర్ వివాహం 1942–5–21న శనిదశ, శన్యంతరంలో జరిగింది శుక్రాచార్యుడు, మద్యపానము మహాపాతకమని శపిస్తే శుక్రజాతకుడైన శ్రీ ఎన్టీఆర్ శుక్రదశలో గుర్వంతరంలో 1995లో ఆంధ్రరాష్ట్రంలో మధ్యనిషేధం విధించడం శుక్ర గ్రహ అనుగ్రహ ఫలితమే ఇది గొప్ప అరుదైన చారిత్రక సంఘటన భవిష్యత్తులో ఉత్తమోత్తమ జన్మప్రాప్తికై 1996–1–18న శుక్రదశ – గుర్వంతరం చంద్ర విదశలలో శ్రీ ఎన్టీఆర్ తనువు చాలించారు దశ, అంతర్దశ, విదశలలో లగ్నమునకు సంబంధించిన మూడు శుభగ్రహముల సమ్మేళనలో మరణము సంభవించుట అసాధ్యమైన విశేషము మరణము పొందినా మరణము లేని మహా పురుషుడు శ్రీ ఎన్టీఆర్



ఉదాహరణ - 8 బిల్‌గేట్స్, అమెరికాలో ప్రధమ ధనవంతుడు పూర్తి పేరు - విలియం హెన్రీ గ్రేట్స్ III జనవరి 1955 - 10-28 ఉదయం 9-15




బిల్‌గేట్స్ గణిత మేధావి, ఎంతో ధారణాశక్తి గలవాడు 12వ సం॥లోనే కంప్యూటర్స్‌లో దిట్ట అయినాడు ఎలక్ట్రిక్ బల్బ్‌కు థామస్ ఆల్వా ఎడిసన్ ఎటువంటివాడో, ఆధునిక కంప్యూటర్ విజ్ఞానానికి "బిల్‌గేట్స్" అటువంటివాడు హార్వర్డ్ విశ్వవిద్యాలయ విద్యార్ధి అయిన పాల్ ఎలెన్‌తో కలిసి, వాషింగ్‌టన్‌లోని రెడ్‌మాండ్‌లో 1975లో 'మైక్రోసాఫ్ట్ కంపెనీ' స్థాపించాడు ఇది 1986 నుంచీ కంప్యూటర్ విజ్ఞానంలో ప్రపంచ ప్రసిద్ధి చెందినది

ఈనాడు 15 మిలియన్ డాలర్లకంటే అధికమైన సంపద కలిగి వుంది

ఈ జాతకునకు శుక్రుడు పంచమకోణంలో స్వక్షేత్రమయిన తులలో, ఉచ్ఛ పొందిన శని నీచ పొందిన రవితో కలిసియున్నాడు శుక్రుడు స్వక్షేత్రం, నీచభంగ రాజయోగం, లగ్నం మిధునం, లగ్నాధిపతి అయిన బుధుడు చతుర్ధ కేంద్రంలో, విద్యాస్థానంలో లాభాధిపతి అయిన కుజునితో కలిసి ఉచ్ఛస్థితి పొందియున్నాడు అందుచేతనే అధికజ్ఞాపకశక్తి, వ్యాపార నైపుణ్యం అలవడ్డాయి బుధుడు కుజునితో కలసి లాభాధిపతి అయిన కుజుని నక్షత్రంలో చిత్తలో 1వ పాదంలో, సింహనవాంశలో నున్నాడు 1982 నుంచి 7 సం॥ల కేతు దశ ప్రారంభం కేతువు 12లో నీచను పొందినప్పటికీ, లాభాధిపతి అయిన కుజుని నక్షత్రంలో మృగశిర 2లో, కన్యానవాంశలో వర్గోత్తమాంశను పొందాడు అందుచేతనే 1986 నుంచీ, మైక్రోసాఫ్ట్ ప్రపంచ ప్రఖ్యాతిని పొందింది 1989 -3-10 నుంచి, బిల్‌గేట్స్‌కు 'శుక్రదశ' ప్రారంభమయింది శుక్రుడు దశమాధిపతి అయిన గురుని నక్షత్రంలో విశాఖలో వృషభ నవాంశను (శుక్రనవాంశ) పొందాడు 1999-10-10 వరకు శుక్రునిలో రాహు అంతర్దశ ఇది చాలా యోగవంతమైన కాలము మిధునలగ్నమునకు శుక్రుడు యోగకారకుడు 2009 సం॥ వరకు చాలా అభివృద్ధికరమైన దశ

ఉదాహరణ-9 జగద్గురు చంద్రశేఖరేంద్ర సరస్వతి

జననం 1894-5-20, విల్లిపురం మ 1-30 ని॥ నిర్యాణం 1994-1-8 ఆత్మకారకుడు శని




శుక్రుడు అష్టమంలో ఉచ్ఛస్థితి రాహుకలయిక, శని దృష్టి పడినది. లగ్నాధిపతి రవి దశమ కేంద్రంలో బుధ-గురులతో చేరి యున్నాడు 13వ సం॥లో బుధ దశ, బుధాంతర్దశలో పీఠాధిపతి అయ్యారు నడచే దేవుడుగా, ప్రత్యక్ష పరమేశ్వరుడిగా, భారతదేశమంతా పాదయాత్ర చేసి ఎందరినో ఉద్ధరించిన పరమ కారుణ్యమూర్తి అపరశంకరులు, వేదోక్తమైన పరిపూర్ణ ఆయుషును 101 సం॥లు జీవించి గురుదశ, గుర్వంతరంలో పరమపదించారు శుక్రదశ చంద్రాంతరంలో స్వామి వారి తండ్రి మరణించారు శుక్రదశరాహ్వాంతరంలో తల్లిగారు మరణించారు శుక్రుడు ఆధ్యాత్మిక రంగంలో, ఉన్నత శిఖరాలకు చేర్చిన జాతకులలో ఇది మొట్టమొదటిది జ్ఞాన మోక్షకారకుడైన కేతువు శనితో కలసి, ఉచ్ఛ శుక్రుని చూచుట చేత, గొప్ప తత్త్వవేత్త అయి, భౌతిక సుఖములన్నిటినీ, ఇచ్ఛాపూర్తిగా పరిత్యజించిన యోగి వరేణ్యుడు అసాధారణ మేధస్సు గల పండితుడు

ఉదాహరణ -10 పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ

జననం 1889-11-14 రాత్రి 11-20 ని॥లకు భారతదేశ ప్రధమ ప్రధాని కర్కాటక లగ్నం




శుక్రుడు, చతుర్ధశ లాభాధిపతి అయి చతుర్ధ కేంద్రంలో స్వక్షేత్రస్థితి, 3-12 అధిపతి అయిన బుధనితో కలయిక, శుక్రదశ 1933-5-11 నుండి 1953-5-1 వరకు జరిగింది స్వతంత్ర భారత ప్రధమ ప్రధాని పదవిని శుక్రదశలో శన్యంతరంలో అలంకరించారు సౌకుమార్యం - సౌందర్యం మూర్తీభవించిన వ్యక్తి, పండిట్ నెహ్రూ అందుచేతనే విశ్వకవి రవీంద్రుడు నెహ్రూను "భారతదేశపు వసంత ఋతువు పండిట్ నెహ్రూ" 'ఋతురాజ్ ఆఫ్ ఇండియా' అని వర్ణించారు

ఉదాహరణ - 11 మొగల్ సామ్రాజ్యాధినేత అక్బర్

జననం 1542-11-26 ఉదయం 4-09 నిౖలకు

| | | |
|---|---|---|
| చ | 7 | రా |
| 10 | రాశి | 4 కు |
| కే | ల 1 శు శ గు | బు ర |

తులాలగ్నం - లగ్నంలో గురు - శుక్ర - శనులు శుక్రక్షేత్రంలో తులాలగ్నంలో, లగ్నంలో శుక్రుడుండగా, యోగకారకుడైన శని ఉచ్చను పొందియుండగా, గురునితో కలిసిన 3 గ్రహముల సమాగమంలో అక్బర్ జన్మించాడు చంగ్రల్నగమును, చంద్ర లగ్నాధిపతి అయిన బుధుడు చూస్తున్నాడు చంద్రునకు, ఏ విధమైన పాపగ్రహ స్పర్శలేనందున, మనస్సు కారకుడైన చంద్రుని వల్ల, అక్బర్ వ్యక్తిత్వం చాలా గొప్పది రాహు దశ చివరిలో తండ్రి హుయమూన్ మరణం అనంతరం ఢిల్లీ గమనం అక్బర్ ప్రథమ పుత్రులు సలీం, 1569లో గురుదశ, కుజాంతరంలో జన్మించాడు రెండవ కుమారుడు మురాద్ 1570లో గురుదశ రాహ్వంతరంలో జన్మించాడు లగ్నంలో స్వక్షేత్ర శుక్రుడు, అక్బర్‌కు భారతదేశంలో జనానురాగాన్ని కలిగించాడు కవి - పండితుడు - శృంగారవేత్త - యోధుడు మత ప్రవక్త - ధార్మికుడు - దయార్థహృదయుడు అయిన అక్బర్ ఈ శుభక్షణాలన్నీ లగ్న శుక్రుని వల్లే పొందడం జరిగింది చివరకు 1605-10-13న బుధదశలో శన్యంతర్దశలో దేహత్యాగం చేశాడు అటు హిందూ రక్ష పర్వతాల నుండి గోదావరి వరకు ఇటు బెంగాల్ నుండి గుజరాత్ వరకూ భారత ప్రజలు ఎంతగానో విలపించారు అక్బర్ జాతకంలో ఎన్నో రాజయోగాలు జ్యోతి పరిశీలకులకు ఆనందం కలిగిస్తాయి

ఉదాహరణ - 12 శ్రీరామకృష్ణ పరమహంస

జననం 1836-2-18 ఉదయం 6-23 నిౖలకు ఆత్మ కారకుడు - రవి

| | | |
|---|---|---|
| 4 కే గు | | శు ర చ బు లగ్నం 1 |
| | రాశి | కు |
| 7 | శ | 10 రా |

ఈ జాతకంలో శుక్రుడు ఉచ్చస్థితి శని భాగ్యస్థితి శని భాగ్యంలో ఉచ్చస్థితి కుజుడు వ్యయంలో ఉచ్చస్థితి రాహు కేతువులు 10-4లో నీచస్థితి ఆత్మకారకుడయిన రవి, ద్వితీయ లాభాధిపతి అయిన గురునిచే చూడబడుటవలన 6-8 అధిపతులయి చంద్ర - బుధునితో లగ్నస్థానములో కలయుట వలన, జాతకుడు ఆత్మోన్నతిని, కుండలినీ శక్తి ప్రబోధమును పొందగలిగినాడు శుక్ర ఉచ్చ స్థితి వలన పరాశక్తి ఆరాధనలో పరాకాష్ఠను పరాసిద్ధిని పొందినాడు

శుక్రగ్రహ అనుగ్రహం చేతనే 'శక్తి ఆరాధన' ఫలిస్తుంది శని గాని, లగ్నాధిపతి గాని, చంద్రుడున్న రాశ్యాధిపతిని చూచినచో జాతకుడు సన్యాసి అగును కుంభలగ్నము తత్వజ్ఞానమును కలిగించు గుంభనమైన రాశి

ఉదాహరణ-13 సంజీవకుమార్, హిందీనటుడు జననం 1937-7-9

| | | |
|---|---|---|
| శు కే బు ర | (4) | శ |
| చ (7) | రాశి | లగ్నం గు (1) |
| | (10) కు | రా |

శుక్రుడు పంచమ కోణంలో స్వక్షేత్రంలో, నీచ, కేతువుతో కలిసియున్నాడు అంశలో తులానవాంశ పొందాడు శుక్ర కారకత్వమైన కళారంగములో విశేష ఖ్యాతి, భోగ జీవితము అనుభవించాడు

ఉదాహరణ -14 సోనియాగాంధి.

జననం 1946-12-9 లూసియానా ఉదయం 9-30 ని॥లకు

| | | |
|---|---|---|
| రా చ | (10) | |
| లగ్నం (1) శ | రాశి | (7) |
| | శు గు (4) | కు ర బు కే |

శుక్రుడు భాగ్యాధిపతి అయిన గురునితో కలసి తులలో స్వక్షేత్రంలో చతుర్ధ కేంద్రమందున్నాడు అంశలో గురు-శుక్రులు కలసి వృషభనవాంశను పొందారు అందుచేతనే, వివాహ కారకుడయిన శుక్రగ్రహానుగ్రహము చేతనే రాజీవ్‌గాంధీ సతీమణి అయ్యింది గురుదశ,

శుక్రాంతర్దశలో రాజీవ్ గాంధీతో వివాహం, శనిదశ, గుర్వంతరంలో పతి వియోగం సంభవించాయి ప్రస్తుతం 97-2-15 నుండి 1999-12-25 వరకూ బుధదశలో శుక్రాంతర్దశ గొప్ప రాజయోగం

ఉదాహరణ -15 సంజయ్‌దత్, సినీనటుడు

జననం 1959-7-29 మధ్యాహ్నం 2-04 ని॥లు వృశ్చికలగ్నం 10N56,72E51

చ 7 కే 4
ర శు బు కు రాశి
10 రా ల శ 1 గు

చంద్రుడు వృషభంలో ఉచ్చస్థితి భాగ్యంలో శుక్రుడు, లగ్న - రాజ్య - లాభాధిపతులతో కలయుట వల్ల కళారంగంలో పేరు ప్రఖ్యాతులు వచ్చాయి గురుదశలా గుర్వంతర్దశ 1999-10-19 వరకూ అంతమంచిది కాదు

ఉదాహరణ - 16 షిర్డీ సాయిబాబా యోగి, జననం 1837-5-18 పత్రి రాత్రి 8-21 ని॥లకు మహాసమాధి 1918-10-15 విజయదశమి, ఆత్మకారకుడు బుధుడు

శు బు ర 7 రా 4
గు రాశి
10 కు శ చ కే ల 1

లగ్నాధిపతి కుజుడు లగ్నాన్ని చూస్తున్నాడు వ్యయంలో కేతువు ఉచ్చశనితోనూ కలిసి యున్నాడు

శుక్రుడు సప్తమంలో స్వక్షేత్రంలో రవి - బుధులతో కలసి యున్నాడు 1904 నుంచి శుక్రదశ ప్రారంభం అయింది యోగశక్తి పొందిన సాయిబాబా శుక్రదశ-శని అంతర్దశలో 1918-10-15న విజయదశమి రోజున మహాసమాధి చెందారు శుక్రుడు ఆధ్యాత్మిక

శిఖరస్థాయి అనుగ్రహించాడు

ఉదాహరణ -17 మైకేల్ జాక్సన్ పాప్ గాయకుడు, జననం 1958-8-29 రాత్రి 6-09 ని॥లు వృశ్చిక లగ్నం భాగ్యశుక్రుడు లగ్న శని

| | | |
|---|---|---|
| (7) | కు కే | (4) చ |
| శు | రాశి | |
| ర (10) బు | గు రా | ల (1) శ |

శుక్రుడు భాగ్యస్థానంలో, లగ్నాధిపతి దృష్టి పొంది, పాపగ్రహ స్పర్శలేకుండా ఉన్నాడు చంద్రలగ్నము నుంచి, కుంభలగ్నానికి యోగకారకుడయిన శుక్రుడు 6వ స్థానంలో శుభ ఫలప్రదాత అందుచేతనే సంగీత రంగంలో ప్రపంచ ప్రఖ్యాతి శుక్రకారకత్వమైన వివాహం కూడా ప్రపంచ ప్రఖ్యాత సంగీత వేత్త అయిన ఎల్విస్ ప్రెస్లీ కుమార్తెతో జరిగింది ప్రస్తుతం 1998-1-11 వరకు బుధ దశలో బుధాంతరం 99-4-8 నుంచి బుధశలో శుక్రాంతం 2-10-0 రో, విశేషయోగం

ఉదాహరణ-18 ఆర్ డి బర్మన్, సంగీత దర్శకుడు జననం 1939-6-

| | | |
|---|---|---|
| శు ర (10) బు | శ కే | గు (7) |
| | రాశి | |
| (1) ల | రా చ | కు (4) |

శుక్రుడు దశమ కేంద్రంలో స్వక్షేత్రస్థితి చంద్రుడు తులారాశిస్థితి భాగ్యంలో శని కేతువులు, సంగీత ప్రపంచంలో ఎన్నో ప్రయోగాలు, నూతన ఆవిష్కరణలు చేసి ఎనలేని కీర్తి గడించి, గాయని ఆశాభోంస్లేను వివాహం చేసుకున్నాడు 1994-1-8న హృద్రోగంతో మరణించారు

ఉదాహరణ - 19 శ్రీ ఎల్ కె అద్వానీ, బి జె పి నాయకులు

జననం 1927-11-8 , సింధ్, ఉ 9-10ని లకు లగ్నం వృశ్చికం




శుక్రుడు లాభమందు నీచస్థితి అంశలో మీనంలో ఉచ్ఛస్థితి అంశలో కుజ – కేతువులతో కలిసాడు శుక్ర క్షేత్రంలో ఉన్న రాహువు యోగించాడు రాహువు దశ కేత్వంతరంలో బిజెపి అధ్యక్షుడైనాడు రాహుదశ శుక్రాంతరంలో విశ్వహిందూ పరిషత్ ద్వారా అఖండ కీర్తి ప్రతిష్టలు 1999-10-2 నుంచి గురుదశలో శుక్రాంతర్దశ ఇది అంత మంచిది కాదు

ఉదాహరణ-20 శ్రీ మురళీమనోహర్ జోషి బి జె పి నాయకులు

జననం 1934-1-5 ఢిల్లీ ఉదయం 10-20 ని లకు




శుక్రుడు అంశలో స్వక్షేత్రంలో తులలో ఉన్నాడు లగ్నం వర్గోత్తమాంశ పొందింది రాహుదశ శుక్రాంతర్దశలో 1992లో బిజెపి అధ్యక్ష పదవి పొందారు 1998-12-19 వరకు గురుదశలో గుర్వంతర్దశ

ఉదాహరణ-21 కృష్ణ, ప్రఖ్యాత తెలుగు నటుడు,

జననం 1943-4-31 ఉదయం 12-10



శుక్రదశలో జననం, రాజ్య - లాభాధిపతులైన శుక్ర - బుధుల పరివర్తన యోగం చంద్రుడు భాగ్యస్థానంలో శుక్ర నక్షత్రమైన భరణిలో నున్నాడు 1967 సం॥ నుండి 10 సం॥ల చంద్రదశ యోగించింది శుక్రకారకత్వమైన సినిమా రంగంలో గొప్ప ఖ్యాతి విశేష ధన సంపాదన, నటీమణి విజయనిర్మలతో 1969-3-24న వివాహం మొ॥ శుక్రశుభ ఫలితములు జరిగాయి 96-5-22 నుండి 1999-5-22 వరకు రాహుదశలో శుక్రాంతర్దశ చాలా మంచిది

ఉదాహరణ-22 సుస్మితాసేన్ - విశ్వసుందరి




చంద్రలగ్నం శుక్రుని స్వక్షేత్రమయిన వృషభం, చంద్రుడు ఉచ్చస్థితి పూభ - వ్యయాధిపతుల పరివర్తన యోగకారకుడైన రవి లగ్నం నుండి శుక్రరాశిని, అందు ఉచ్చస్థితిని పొందిన చంద్రుని చూస్తున్నాడు 6వ అధిపతి 8లో ఉన్నాడు 8వ అధిపతి 12లో ఉన్నాడు 6-8-12 అధిపతుల పరివర్తన చేత విపరీత రాజయోగం పట్టింది భారతదేశానికి "శుక్రదశ" జరుగుతున్న తరుణంలో, భారతదేశానికి చెందిన "సుస్మితాసేన్" 1994 విశ్వసుందరిగా ఎన్నికవడం శుక్రగ్రహానుగ్రహ ఫలితమే

ఉదాహరణ-23 అమితబ్ బచ్చన్, హిందీనటుడు

జననం 1942-10-11 సా॥ 4 గం॥లకు

తులారాశి-కుంభలగ్నం, శుక్రుడు శుక్రనవాంశ



శుక్రగ్రహం నీచభంగరాజయోగం పొందాడు అంశలో శుక్రుడు, వృషభ స్వక్షేత్ర స్థితి రాశి శుక్రరాశి అయిన తుల శుక్రకారకత్వమైన సినిమారంగంలో అఖండ కీర్తి ప్రతిష్ఠలు, భోగ జీవితం 2003 సం॥ వరకు చాలా బాగుంది

ఉదాహరణ-24 ఎమ్ సంపత్‌కుమార్, జోతిషపండితుడు "శుక్రగ్రహం" గ్రంథ రచయిత జననం 1957-5-21, రాత్రి 7-50 ని॥లకు శుక్రుడు వృషభ స్వక్షేత్ర స్థితి శుక్రశనుల సమ సప్తకం, రాశిలోనూ, అంశలోనూ వర్గోత్తమ స్థితి




ఉన్నత వంశజననం 5-10 స్థానములలో చంద్రగురుల కేంద్రస్థితి వల్ల, గజకేసరి యోగం 6-8 అధిపతుల పరివర్తనవల్ల, విపరీత రాజయోగం 4 కేంద్రములలోనూ 5 గ్రహముల స్థితి, గురు - శుక్రులిద్దరు 10-7 కేంద్రములందు ఉండటం వల్ల జాతకునికి గొప్ప దైవబలము కలదని తెలియచేస్తున్నది దశమ గురుని దశలో విశేషజ్ఞానం, సంస్కృత, జ్యోతిష, మంత్ర, సంగీత, వాద్య, కవిత్వ రంగములందు విశేష ప్రతిభసం ప్రాప్తించింది ఈ జాతకుడు స్పృశించని అంశము లేదు అంశలో గురుని, స్వక్షేత్ర ధనుస్థితి వల్ల ధన - కుటుంబ - పుత్ర - కీర్తి ప్రతిష్ఠలు బాగుంటాయి ఎక్కువగా గురుదశజ్ఞాన పరంగానే యోగించింది గురునిపై శని దృష్టి వల్ల ఆర్థిక నష్టం - కొంత కర్మ భ్రష్ఠత్వం, ప్రస్తుత శనిదశలో యోగం, "చండీఉపాసన" లలితా సహస్రానికి భాస్కరాచార్యులవారు "సౌభాగ్య భాస్కరి" అనే సంస్కృతి వ్యాఖ్య రచించారు వీరు అమ్మవారిని కన్నుల ముందు సాక్షాత్కరింపచేసుకొని ఎందరినో తరింపచేసిన మంత్రమూర్తి లలితా సహస్ర వ్యాఖ్యలో, 322 అపూర్వ గ్రంధాల పరిశీలన, వీరి విజ్ఞాన ఘనత్వాన్ని సూచిస్తుంది ఈ వ్యాఖ్యను మించిన గ్రంథం లేదు అందులో "హ్రీంకారీ-హ్రీమతీ-విద్యా-హేయో పాదేయవర్జితా' అన్నచోట, 'హ్రీంకారీ' అన్న నామానికి వ్యాఖ్య రచిస్తూ, స్వంతంత్ర తంత్రంలోని ఒక వ్యాకులాక్షర శ్లోకాన్ని ఉదహరించారు ఈ శ్లోకానికి అర్థం ఇంతవరకూ ఎవరూ చెప్పలేదు శ్లోకాక్షరములన్నీ అస్తవ్యస్తంగా ఉండి అగమ్యగోచరంగా కలగాపులగం చేయబడి ఉంటుంది దీని క్రమాన్ని, అర్థాన్ని వివరించవలసినదిగా 1985లో తిరుమల తిరుపతి దేవస్థానం వారు, సంస్కృత లిపిలో ప్రచురించిన లలితాసహస్రం, సౌభాగ్య భాస్కరి వ్యాఖ్య పుస్తకంలో పేర్కొన్నారు

"అమ్మ" అనుగ్రహం చేత ఈ జాతకుడు, ఆ శ్లోకాన్ని క్రమబద్ధం చేసి, అర్ధ వివరణ తెలుసుకున్నాడు దీనికి మంత్రశాస్త్ర పరిజ్ఞానం, వ్యాకరణ శాస్త్రం, ఆ పైన అమ్మ దయ ఉంటేనే సాధ్యం భువనేశ్వరీ బీజమైన "హ్రీం" కారమే ఆ శ్లోకంలో వివరించబడింది ఈ పరాశక్తి ఆరాధన "శుక్రగ్రహం యొక్క అనుగ్రహం వల్లే సిద్ధిస్తుంది అమ్మవారి పేరు వింటేనే ఏదో ఒక అలౌకిక భావన కలుగుతుంది

లలితా పరాభట్టారిక గూర్చి ఈ జాతకుడు వ్రాసిన చంధోబద్ధ సంస్కృత శ్లోకం ఇందులో షోడశీమంత్రం ప్రక్షిప్తం చేయబడింది"

మాలిని॥ సకల హవన మధ్యే మంత్రరూపే చరతీ
కలహసిత ముఖ శ్రీః కామితార్ధ ప్రదాత్రీ ।
ల మితియజనతోషా బీజసారా త్రినేత్ర
హసకహల గుహాంతాపాతుమాం విశ్వమాతా ॥

జ్ఞాన పిపాసియై, ఈ జాతకుడు గురుదశలో పుస్తకాల నిమిత్తం సుమారు లక్ష రూపాయలు ఖర్చు చేసాడు ఒక గొప్ప మనోస్థితి ఈ జాతకునికి లభించిన గ్రహానుగ్రహ ఫలితం మహామహోపాధ్యాయుల వద్ద శిష్యరికం, ప్రఖ్యాత నగరాల్లో మహాపండితులతో పరిచయం, శాస్త్ర చర్చలు సంప్రాప్తించాయి

సంగీతములో వేణుగాన విద్వత్తు, వేదమంత్రాల అర్ధవివరణా పరవశత - జ్యోతిషగ్రహ కారకత్వ అనుసంధాన చతురత, ఇవన్నీ అపూర్వ సమ్మేళనాలు

ఉదాహరణ-25 ఎమ్ సోమశేఖర ప్రభాకరరావు, జ్యోతిష పండితుడు, ఈ పుస్తక రచయిత సోదరుడు జననం 1960-8-1 తులారాశి, శుక్రుడు అంశలో ఉచ్ఛస్థితి

జాతకంలో బుధుడు మిధున స్వక్షేత్రస్థితి అంశలో వర్గోత్తమ స్థితి, ఆత్మకారకుడు కూడా బుధుడే, అందుచేత చాలా సూక్ష్మబుద్ధి ఏదైనా స్వయంకృషితో సులభంగా గ్రహించి ఆ సబ్జక్ట్‌లో పట్టు సాధించగల దిట్ట

బుధదశలో శుక్రాంతర్దశలో ధన కనక వస్తువాహనాల్లో చాలా వైభవంగా గడించింది కారణం శుక్రుడు భాగ్యస్థితి అంశలో ఉచ్ఛస్థితి, చంద్రాంతరం పాడుచేసింది కారణం చంద్రుని వ్యయస్థితి, తిరిగి బుధదశలోనే కుజాంతరం నుంచి భాగ్యవృద్ధి ధనాధిపతి ధనకారకుడు అయిన గురుడు ధనస్థానంలో స్వక్షేత్రంలో ఉండడం వల్ల, జీవితాంతం గొప్ప ధనవంతుడు, ఏ లోటూ లేదు

## శుక్రగ్రహం - బంగారు నగలు

నగలకూ, అలంకరణలకూ వజ్రమణులకూ కారకుడు శుక్రుడే బంగారు నగలంటే మక్కువలేని మగువలు ఎంతో తక్కువ ఒక స్త్రీ తన జీవితంలో ఎన్నో నగలూ, చీరలూ,

విలాసవంతమైన జీవితం గడపాలంటే 'శుక్రానుగ్రహం' ఉండవలసిందే సాధారణంగా శుక్రుడు-గురుడు, లగ్నాధిపతి, చతుర్థాధిపతి, శుభస్థానాలలో ఉన్న జాతకులు సుఖజీవితం గడుపుతారు చతుర్థము సుఖస్థానము

ఉదాహరణ 26 ఎమ్ సూర్య సావిత్రి ఈ పుస్తక రచయిత తల్లి జననం 1927-11-21 ఈమె 100 కాసుల బంగారు నగలు 34 సం॥లు ధరించారు తులారాశి - శుక్రగ్రహ బుధగ్రహ పరివర్తన, దశమ గురుడు ఈమె గొప్ప సంగీత విద్వాంసురాలు, వైణికులు, తమిళనాడులో ప్రసిద్ధ సంగీత విద్వాంసురాలు వైణికులు, తమిళనాడులో ప్రసిద్ధ సంగీత విద్వాంసులైన మధురై మణిభాగవతార్ వద్ద సంగీత విద్యాభ్యాసం చేశారు అనంతరం, భర్త వద్ద వయోలిన్ వాదన నేర్చారు ఒకటవ శృతికి పై శృతిలో కమనీయమైన కోకిల వంటి కంఠధ్వని కలిగిన గాయని 74 వర్ణములు 200 కృతులు వీరికి కంఠస్థం ఎందరో సంగీత విద్యార్థులకు గురువు




శుక్రుడు చతుర్థ విద్యాస్థానంలో ఉన్న వారికి "సంగీత విద్య" అలవడుతుందనే శాస్త్ర ప్రమాణానికి నిదర్శన

లగ్నాధిపతి చతుర్థాధిపతి అయిన బుధుడు, పంచమాధిపతి అయిన శుక్రునితో పరివర్తన యోగం పొందాడు శుక్ర - గురులు ఇద్దరూ 4-10 కేంద్రస్థానాలలో నున్నారు మిధునలగ్నానికి బాధకుడైన గురుని స్వక్షేత్రస్థితి వల్ల రావలసినంత ప్రఖ్యాతి మాత్రం రాలేదు

శ్లో॥ వ్యయాధిపే చంద్రయుతే కర్మపేనయుతే ధవా ।
అనాయాసేన మరణం జాతకస్యన సంశయః ॥

తా-వ్యయాధిపతి చంద్రునితో కలిసినా, దశమాధిపతితో కలసినా అనాయాస మరణం కలుగుతుంది వ్యయాధిపతి అయిన శుక్రుడు, ధనాధిపతి అయిన గురునితో సమసప్తక స్థితిలో నుండుట వలన 1993-1-25న హృద్రోగం వలన బుధ దశ 1 గుర్వంతర్దశలో 66వ ఏట అనాయాసమైన, జ్ఞాన పూర్వకమైన దేహత్యాగం చేశారు

## శుక్రుడు - 6వ సంఖ్య

సంఖ్యాశాస్త్రంలో శుక్రగ్రహం సంఖ్య 6 వారములలో ఆదివారము నుండి లెక్కించినచో శుక్రవారం 6వది అందుచేత ఈ సంఖ్యకూ, శుక్రగ్రహమునకు అవినాభావ సంబంధమున్నది. శుక్రగ్రహం ప్రభావం ఉన్న వ్యక్తులు 6-15-24 తేదీలలో జన్మిస్తారు వీరి అదృష్ట సంఖ్య 6 ఈ సంఖ్య కోమలత్వం, కళలు, సౌందర్యం, సుఖజీవనం, వాహనములు రుచికరమైన భోజనములు, విలాసవంతమైన జీవితం మొ॥ ఎన్నో విషయములకు ఆధిపత్యం వహిస్తుంది మెండలీవ్ అణు ఆవర్తన పట్టికలో మూలకాలను పేర్కొంటూ కర్బన పరిమాణు సంఖ్య 6 అని, నిర్ధారించాడు ఇది శుక్రుని సంఖ్య, శుక్రుని మణి అయిన "వజ్రం" పూర్తి కర్బన పదార్థం ఆయుష్కారకుడైన శని సంఖ్య 8 ఆవర్తన పట్టికలో 8, ఆక్సిజన్ మానవుడికి ప్రాణమిచ్చేది "ఆక్సిజన్" ఈ విధంగా సైన్స్‌తో జ్యోతిషశాస్త్రం అనుసంధానమవుతుంది

మహానటి సావిత్రి జన్మదినం 1936-12-6
మంగళంపల్లి బాలమురళీకృష్ణ 1930-7-6
సినీనటి కృష్ణకుమారి 1932-3-6

ఇలా ఉదహరిస్తూ ఉంటే ఎన్నో ఉన్నాయి

సంఖ్యాశాస్త్ర రీత్యా 6-15-24వ తేదీలలో జన్మించినవారు శుక్ర వ్యక్తులని పిలువబడతారు సూర్యగతి రీత్యా, వర్తమానంలో సూర్యుడు వృషభ, తులలో సంచారం చేసేటప్పుడు అనగా మే 15 నుంచి జూన్ 15 వరకు వృషభంలో సూర్యుడు ఉంటాడు కనుక ఈ నెలలో జన్మించినవారు వృషభరాశివారు దీనికి అధిపతి శుక్రుడు తరువాత అక్టోబర్ 14 నుంచి నవంబర్ 15 వరకూ సూర్యుడు తులలో ఉంటాడు తులకు అధిపతి శుక్రుడు

ఈ 6వ తేదీ, జన్మ సంఖ్య అయిన వారు మంచి ఆకర్షణీయంగా, రంగుగా, అందంగా, పర్సనాలిటీగా ఉంటారు మంచి ప్రేమికులు వీరికి తెలుపు - నీలం మంచి అదృష్టపు రంగులు. నలుపు వాడరాదు వీరికి అదృష్ట రత్నము వజ్రం, తెల్ల పగడం 6 అదృష్ట సంఖ్యగా జన్మించిన ప్రముఖులు

| | |
|---|---|
| క్వీన్ విక్టోరియా | మే నెల 24వ తేదీ |
| నెపోలియన్ | ఆగష్టు 15 |
| జాన్ ఆఫ్ ఆర్క్ | జనవరి 6 |
| మైకేలేంజలో | మార్చి 6 |
| వారన్ హేస్టింగ్స్ | డిశంబర్ 6 |
| మాక్స్ ముల్లర్ | డిశంబర్ 6 |

| | |
|---|---|
| టెన్నీసన్ | ఆగస్టు 6 |
| అలెగ్జాండర్ | ఆగస్టు 6 |
| యురేనస్ గ్రహమును కనుగొన్న | |
| సర్‌విలియం హెర్చల్ | నవంబర్ 15 |
| కింగ్‌జార్జ్ 1 | డిశంబర్ 24 |

6 అదృష్ట సంఖ్యగా కలిగిన వారికి ఈ క్రింది సంఖ్యాయంత్రము వెండిరేకుపై గాని, బంగారు రేకుపై గాని చెక్కించి ఉంగరంగా, తాయెత్తుగా ధరించినచో శుక్రగ్రహం యొక్క అనుగ్రహం కలిగి శుభఫలితాలు కలుగుతాయి

| | | |
|---|---|---|
| 11 | 61 | 3 |
| 12 | 10 | 8 |
| 7 | 14 | 9 |

## శుక్రగ్రహం - రేసులు

మానవుడు సునాయాసంగా ధనం సంపాదించడానికి గల అనేక రకాల జూదములలో గుర్రం పందాలు ఒకటి జూదానికి కారకుడు కేతువు దీనికి సంబంధించిన మార్మిక సంఖ్య-7

శుక్ర గ్రహమునకు చెందిన కారకత్వ ప్రాణులలో "గుర్రం" ముఖ్యమైనది ఈ రేసులలో తనాలా, జాక్‌పాట్ అనే విధానాలుంటాయి

పందెంలో పాల్గొనే గుర్రాల వంశ చరిత్ర - వయస్సు - బరువు - రంగు, దీనిని నడిపే రౌతు ఇవన్నీ ముందుగా పుస్తకాల ద్వారా తెలుసుకోవచ్చు గుర్రాల వంశ చరిత్ర తెలిపే దానిని "పెడిగ్రీ" అంటారు.

మచ్చలేని సంపూర్ణమైన తెల్లటి గుర్రం సాక్షాత్తు శుక్రగ్రహ సంకేతమే గుర్రంపై తెల్లటి మచ్చలున్న వాటిని, శ్రేష్ఠమైన 'మరెమ్మా స్టాలెన్' జాతి గుర్రాలంటారు

పూర్వకాలంలో విశ్వామిత్రుని శిష్యుడు 'గాలవుడు' గురు దక్షిణ తీసుకొమ్మని బలవంతము చేయగా, విసుగు చెందిన విశ్వామిత్రుడు, శరీరమంతయూ శుభ్రమైన తెల్లని రంగు కలిగి ఒక్క చెవి మాత్రము "నీలం రంగు" కలిగిన మేలు జాతి గుర్రములను 800 ఇమ్మని కోరెను గాలవుడు ఎన్నియో పాట్లుపడి చివరకు 600 గుర్రములు సంపాదించి, గురుదక్షిణ స్వీకరింపమని విశ్వామిత్రుని ప్రార్థించెను

ఇక్కడ గమనించవలసినది ఏమిటనగా, ప్రాచీనుల ఉత్తమ అభిరుచి, అశ్వప్రాధాన్యత, ధర్మనిరతి అనుపమానం

లగ్నాధిపతి - ధనాధిపతి - లాభాధిపతి, కేతు - శుక్ర గ్రహములు పంచమాధిపతి, వీరందరి అనుగ్రహం ఉన్న జాతకుడే "రేసులలో" జాక్‌పాట్ పొందగలడు పైగా, పోటీ రోజున నక్షత్రాధిపతితో వీరికి సంబంధం ఉండాలి లేకపోతే విజయం అసంభవం

గమనించవలసిన అంశములలో మన అదృష్ట సంఖ్య, అదృష్టపు రంగు, గుర్రం పేరు - జాకీపేరు - జాకీ ధరించిన కేప్ రంగు - అన్నీ పరిశీలించాలి సంఖ్యాశాస్త్రమైన డా॥ ఎమ్ కటక్కర్ ఇలా తెలియజేస్తున్నారు "అనేక సంవత్సరాల రేసుల పరిశోధనలో 3-6 రేసులలో సాధారణంగా, టోటల్ 3-6 సంఖ్య గల గుర్రాలు విజయం సాధిస్తున్నాయి లేదా ఒక్కొక్కసారి 3-6 స్థానాలు పొందుతున్నాయి" ఇది కూడా పరిగణించవచ్చు

వ్యసనాలలో జూదానికి పరాకాష్ఠ రేసులే ఇందులో విశేష ధన సంపాదనకు శుక్ర-కేతు గ్రహముల అనుగ్రహం అత్యంతావసరం అందుకే అసలు జాతకునికి, జూదంలో ధన సంపాదన యోగం ఉందా ? లేదా ? చూడాలి

జ్యోతిషం - సంఖ్యాశాస్త్రం వీటి పరిశీలన వల్ల, గుర్రాల పిడిగ్రీలవల్ల, కొన్ని ముఖ్యమైన రోజులలోనే పరిమితంగా ఆడవచ్చు వేరియేషన్స్‌లో చెత్త వాటిని పరిహరించవచ్చు

## శుక్రుని అనుగ్రహం పొందడం ఎలా ?

ఈ క్రింద చెప్పిన ప్రక్రియలు కేవలం శుక్ర-శని-బుధ-రాహు దశాంతర్దశలు జరుగు వారికే సత్ ఫలితాలనిస్తాయి

1 - శుక్ర గ్రహం అధిష్ఠాన దేవత "లక్ష్మీదేవి', శుక్రవారం లక్ష్మీపూజ, లక్ష్మీ అష్టోత్తరం, "శ్రీం" బీజమంత్రజపం, శ్రీ సూక్తి పారాయణ వల్ల శుక్రగ్రహం యొక్క దయ కలుగుతుంది లక్ష్మీ దేవిని శుక్రవారం, భరణి, పుబ్బ, పూర్వాషాఢ నక్షత్రం రోజు, శుక్రుడు వృషభ, తుల, మీనరాశులలో సంచరించే రోజులలో 108 తెల్ల తామర, ఎర్రని కమలాలతో అర్చిస్తే ధనవృద్ధి కలుగుతుంది

2 - 6 శుక్రవారాలు వారానికి 1 కేజి బొబ్బర్లు బ్రాహ్మణులకు దానం చేయాలి

3 - తెల్లని వస్త్రములు, వజ్రము, తెల్ల గొడుగు, వాహనము, వెండి, విలాసవస్తువులు శుక్రవారము రోజు, శుక్రహోరలో బ్రాహ్మణులకు దానం చేస్తే శుక్రుని అనుగ్రహం కలిగి జాతకుడు సుఖము పొందుతాడు

4 - వజ్రం - లేదా, తెల్ల పగడం శుక్రహోరలో చేయించి, 1 రోజు రాత్రి గుర్రం మూత్రంలో ఉంచి, అనంతరం పాలతో కడిగి ప్రాణ ప్రతిష్ఠ చేసి కుడిచేయి మధ్య వేలికి ధరిస్తే శుక్రుని అనుగ్రహం కలుగుతుంది తెల్లని గుర్రం బొమ్మ లేదా క్యాలండర్ ఇంట్లో ఉంటే మంచిది

5 - శుక్రవారం 6-15-24 తేదీలు, భరణి - ఉబ్బ - పూర్వాషాడ రోజున స్త్రీల మనస్సు రంజింపచేయాలి

6 - ఏ స్త్రీని అయినా మాటలతో, చేతలతో హింసించరాదు స్త్రీలను బాధపెడితే శుక్రగ్రహం ఆగ్రహానికి గురవుతారు

7 - గుర్రం కాలికి ఉపయోగించిన, అరిగిన నాడా, తాంత్రిక పూజ చేసి గృహము లేదా వ్యాపారము చేయు స్థలమునందు స్థాపించినచో "ఆకర్షణశక్తి" ధనవృద్ధి కలుగుతాయి

8 - గుర్రం తల బొమ్మ, గుర్రం నాడా ఆకారాలను, "కీ చైనులు"గా ఉపయోగించిన చాలా మంచిది

ప్రఖ్యాత అణుశాస్త్రవేత్త "నీల్స్‌బోర్" తన ఖరీదైన కారుకు గుర్రం నాడాను కట్టాడు సాటివారు మీ వంటి భౌతిక శాస్త్రవేత్తకు మూఢనమ్మకాలున్నాయా ? అని ప్రశ్నిస్తే, ఇది మూఢనమ్మకం కాదు, నిజంగా గుర్రంనాడాలో శుభప్రదమైన శక్తి ఉంటే దాని పని అది చేసుకుపోతుంది అన్నాడు పాశ్చాత్యులకు "గుర్రం నాడా" అదృష్ట చిహ్నం సైన్స్ రీత్యా కూడా "సైకోమెట్రీ" ప్రకారం ఒక వ్యక్తి నిరంతరం ఉపయోగించిన వస్తువును ఆ వ్యక్తి సంబంధించిన శక్తులు వాసనారూపేణ ఆ వస్తువుకు సంక్రమిస్తాయి అందుకే గుర్రం ఉపయోగించిన నాడాకు, గుర్రం యొక్క అలౌకిక విద్యుదయస్కాంత శక్తి కలుగుతుంది అందుకే మానవుని తొడిగిన చొక్కా వాసన రీత్యా కుక్కలు, ఆ వ్యక్తి ఎక్కడున్నాడో పసిగట్టి అక్కడకు తీసుకువెళతాయి

9 - మరికొన్ని ప్రక్రియలు కేవలం గురు ముఖంగా తెలుసుకోవలసినవే తప్ప, పుస్తకాలలో వ్రాయరాదు

## శుక్రుని 24 నామాలు

శ్లో॥ శుక్రః శుభగ్రహః శ్రీమాన్ వర్షకృత్ వర్ష విఘ్నకృత్,
తేజోనిధిః జ్ఞానదయా యోగీ యోగవిదాం వరః
దైత్య సంజీవనశ్రాంతో దైత్య నేత్రోశనాకవిః
నీతికర్తా గ్రహాధీశో విశ్వాత్మాలోకపూజితః
శుక్రమాల్యాంబరధరః శ్రీ చందన సమప్రభః
అక్షమాలాధరః కావ్యః తపోమూర్తిర్ధనప్రదః
చతుర్వింశతి నామాని అష్టోతర శతం యధా
దేవస్యాగ్రే విశేషేణ పూజాంకృత్వా విధానతః
యఇదం పఠతిస్తోత్రం భార్గవస్యమహాత్మనః
విషమస్థో పి భగవాన్ తుష్టస్స్యాన్నాత్ర సంశయః ॥

★ శుక్రగ్రహమును తెల్లని పూలతో పూజించి ఈ 24 నామముల స్తోత్రం పఠించిన వారికి, శుక్రుడు చెడు రాశుల యందున్ననూ ప్రసన్నుడగును

## శుక్రాష్టోత్తర శతం

శ్లో॥ శుక్రః శుచిః శుభగుణశ్శుభదశ్శుభ లక్షణః
శోభనాశ్శుభరూపశ్శుద్ధ స్ఫటిక భాస్వరః
దీనార్తి హారకో దైత్య గురుర్దేవాభినందితః
కావ్యాసక్తః కామపాలః కవిః కల్యాణదాయకః
భద్రమూర్తిః భద్రగుణో భార్గవో భక్తపాలకః
భోగదో భువనాధ్యక్షః భుక్తి ముక్తి ఫలప్రదః
చారుశీల శ్చారురూపశ్చారుచంద్ర నిభాననః
నిధిర్నిఖిల శాస్త్రజ్ఞో నీతివిద్యాదురంధరః
సర్వలక్షణ సంపన్నః సర్వావగుణ వర్జితః
సమానాధిక నిర్ముక్త సకలాగమపారగః
భృగుర్భోగకరో భూమీ సురపాలన తత్పరః
మనస్వీమానదో మాన్యో మాయాతీతో మహాశయః
బలిప్రసన్నో ఽ భయదో బలీ బలపరాక్రమః
భవపాశ పరిత్యాగో బలిబంధ విమోచకః
ఘనాశయో ఘనాధ్యక్షోకంబుగ్రీవ కళాధరః
కారుణ్య రస సంపూర్ణః కళ్యాణ గుణవర్ధనః
శ్వేతాంబరః శ్వేతవపుః చతుర్భుజ సమన్వితః
అక్షమాలాధరో ఽ చింత్య అక్షీణ గుణభాసురః
నక్షత్ర గుణసంచారో నయదో నీతిమార్గదః
వర్షప్రదో హృషీకేశః క్లేశనాశకరః కవిః
చింతితార్థ ప్రదశ్శాంత మతిశ్చిత్తసమాధికృత్
ఆదివ్యాధి హరో భూరి విక్రమః పుణ్యదాయకః
పురాణ పురుషః పూజ్యః పురహూతాదిసన్నుతః
అజేయోవిజితారాతిః వివిధా భరణోజ్వలః
కుందపుష్ప ప్రతీకాశో మందహాసోమహామతిః
ముక్తా ఫలసమానాభో ముక్తిదో ముని సన్నుతః
రత్న సింహాసనారూఢో రథస్థో రజిత ప్రభః

సూర్య ప్రాగ్దేశ సంచార సురస్సుభ్రు సుహృత్కవిః
తులా వృషభ రాశిశో దుర్ధరో ధర్మపాలకః
భాగ్యదో భవ్యచారిత్రో భవపాశవిమోచకః
గౌడ దేశేశ్వరో గోప్తా గుణీగుణ విభూషణః
జ్యేష్ఠా నక్షత్ర సంభూతో జ్యేష్ఠః శ్రేష్ఠః శుచిస్మితః
అపవర్గ ప్రదో నంతః సంతాన ఫలదాయకః
సర్వైశ్వర్య ప్రదస్సర్వ గీర్వాణ గణ సన్నుతః ॥

ఇతి శుక్రాష్టోత్తర శతనామ స్తోత్రం సంపూర్ణం

## శుక్రగ్రహ మంగళస్తోత్రం

శ్లో॥ శుక్రోభార్గవ గోత్రజో సితరుచిః పూర్వాముఖః పూర్వదిక్
పాతాళస్థ వృషస్తులాధిప మహారాష్ట్రాధిపోదుంబరః ।
ఇంద్రాణీ మఘవా బుధశ్చరవిజో మిత్రార్కచంద్రావరీ
షష్ఠ త్రిర్దశ వర్జితే భృగుసుతః కుర్యాత్సదా మంగళం ॥

## పురాణోక్త శుక్రగ్రహ శాంతి

శ్లో॥ హిమ కుందమృణాళాభం దైత్యానాం పరమం గురుం
సర్వశాస్త్ర ప్రవక్తారం భార్గవం ప్రణమామ్యహం ।

మంత్రం ఓం హ్రీం శ్రీం శుక్రాయ నమః ।

20 వేలు జపించాలి

## శుక్రుని గోచార మంత్రం

"ఓం ద్రాం ద్రీం ద్రౌం సః శుక్రాయనమః"

ఇది గోచారరీత్యా శుక్ర సంచార దోషములు పోగొడుతుంది ఇది కూడ 20 వేలు జపించాలి

## వేదోక్త శుక్రగ్రహ శాంతి

ఓం అస్యశ్రీ శుక్రమహామంత్రస్య భరద్వాజ ఋషిః శుక్రగ్రహదేవతా । త్రిష్టుప్ ఛందః యజమానస్య కామకాయన విశ్వామిత్ర గోత్రస్య సంపత్ కుమార్ నామధేయస్య అధిదేవతా ప్రత్యధిదేవతా సహిత శుక్ర గ్రహారాధినే వినియోగః ।

ధ్యానం - శ్వేతాంబరో శ్వేతవపుః కిరీటీ, చతుర్భుజోదైత్య గురుః ప్రశాంతః । తథాసి దండం చ కమండలుం చ తదాక్ష సూతాద్వరదోస్తు మహ్యాం । మంత్రం । శుక్రంతే అన్యద్య జతంతే అన్యద్విషు రూపే అహనీ ద్యౌరివాసి విశ్వహి మాయా అవసి స్వధావో భద్రాతే పూషన్నిహ రాతిరస్తు ॥ ఓం భూర్భువస్సువః ॥ శుక్రగ్రహ ఇహాగచ్ఛ, శుక్రగ్రహం - శ్వేతవర్ణం, శ్వేత గంధం, శ్వేత పుష్పం, శ్వేత మాల్యాంబర ధరం, శ్వేతచ్ఛత్ర ధ్వజ రధ పతాకాదిశోభితం, దివ్యరధ సమారూఢం, మేరుం ప్రదక్షిణీ కుర్వాణం, పూర్వాభిముఖం, పద్మాసనస్థం, చతుర్భుజం, దండాక్షమాలా జటావల్కలధారిణం, కాంభోజ దేశాధిపతిం భార్గవసగోత్రం, పార్థివసంవత్సరే శ్రావణమాసే శుక్లపక్షే ద్వాదశ్యాం జ్యేష్ఠా నక్షత్రే జాతం తులావృషభ రాశ్యాధిపతిం భృవారయుక్తం కిరీటినం సుఖాసీనం పుత్ర పరివారసమేతం గ్రహమండలే ప్రవిష్టమస్మిన్నధికరణే, సూర్యగ్రహస్య ప్రాగ్భాగే, పంచకోణాకార మండలే శుక్రగ్రహ మావాహయామి స్థాపయామి పూజయామి

## అధిదేవత - ఇంద్రాణి

ధ్యానం - సింహాసన స్థాంద్విభుజాం స్వర్ణాభాంచసుసుందరీం శిలాసనాం శచీంధ్యాయే రక్తాంబుజ కరాంబుజాం । మంత్రం - ఇంద్రాణీ మాసునారీషు, సుపత్నీమహమశ్రవం । సహస్యా అపరంచన జరసామరతేపతిః । ప్రత్యధిదేవత - ఇంద్రుడు

ధ్యానం - ఇంద్రపీరం చతుర్బాహం సహస్త్ర నయనోజ్వలం ।
వజ్రాంకుశాది సంయుక్త పాణింధ్యాయేత్సుసంయుతం ॥
మంతం - ఇంద్రమరుత్వంత ఇహపాహిసోమం
యధాశార్యాతే అపి బసుతస్య, తవప్రణీతితవ
శూర శర్మాన్నా వివాసంతిక వయస్సు యజ్ఞాః ॥

స్వస్తి

## శుక్ర యంత్రం

ఇది రాగి - వెండి - బంగారు రేకుపై వ్రాసి పూజించి శుక్రవారం శుక్రహోరలో ధరిస్తే మంచిది

## శుక్రదశలో శాంతి

శుక్రదశలో శుక్రాంతరంలో పూర్ణ జలపాత దానం రవ్యంతర్దశలో సూర్య నమస్కారములు, చంద్రాంతర్దశలో అమ్మవారి పూజ, కుంజాతర్దశలో కుమారస్వామిపూజ, రాహ్వంతరంలో దుర్గా, కాళీపూజ, గుర్వంతరంలో శివసహస్ర పఠనం, శన్యంతరంలో గేదెదానం, బుధాంతరంలో అన్నదానం, కేత్వంతరంలో మేకదానము చేసినచో కీడు పోవును

## శుక్రయంత్రం

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 3 | 2 | 1 | 6 | 5 | 4 | 9 | 8 | 7 |
| 9 | 8 | 7 | 3 | 2 | 1 | 6 | 5 | 4 |
| 6 | 5 | 4 | 9 | 8 | 7 | 3 | 2 | 1 |
| 1 | 3 | 2 | 7 | 9 | 8 | 4 | 6 | 5 |
| 7 | 9 | 8 | 4 | 6 | 5 | 1 | 3 | 2 |
| 4 | 6 | 5 | 1 | 3 | 2 | 7 | 9 | 8 |
| 8 | 7 | 9 | 2 | 1 | 3 | 5 | 4 | 6 |
| 5 | 4 | 6 | 8 | 7 | 9 | 2 | 1 | 3 |
| 2 | 1 | 3 | 5 | 4 | 6 | 8 | 7 | 9 |

ఇది రాగి – వెండి – బంగారు రేకుపై వ్రాసి, పూజించి శుక్రవారం శుక్రహోరలో ధరిస్తే మంచిది

## శుక్రగ్రహస్నానం

గోరోచనము కలిపిన నీరు, వెండి పాత్రలతో పోసుకొని స్నానము చేసినచో శుక్రగ్రహమునకు సంతోషకరమగును శుక్రవారము నాడు ఇట్లు చేసినచో శుక్రుని అనుగ్రహమునకు పాత్రులగుదురు

## శుక్రగ్రహ కీర్తన

ముత్తుస్వామి దీక్షితుల వారు (1775–1835) కర్ణాటక సంగీతములో త్రిమూర్తులలో ఒకరు, మిగిలిన ఇద్దరూ త్యాగయ్య – శ్యామశాస్త్రి ఈయన నవగ్రహముల గూర్చి, సంస్కృతములో 9 కీర్తనలు రచించారు ఇవి ఎంతో ప్రభావం కలిగినటువంటివి బీజాక్షర సంపుటులు, గ్రహ వర్ణనా వైచిత్రి కలిగినవి వీటిలో శుక్రునిపై కీర్తన

రాగం – ఫరజు, తాళం – ఆట

పల్లవి – శ్రీ శుక్రభగవంతం చింతయామి సతతం సకల తంత్రజ్ఞమ్ ।

అనుపల్లవి · హే శుక్ర భగవాన్ మమాశుపాలయ
వృషతులాధీశ దైత్యహితోపదేశ
కేశవకటాక్షైకనేత్ర కిరీటధర ధరళగాత్ర ॥

చరణం

వింశతి వత్సరోడు దశావిభాగమష్టవర్గం
కవింకళత్ర కారకం, రవినిర్జర గురువైరిణం
నవాంశహోరాద్రేక్కాణాది వర్గోత్తమావాసరసమయే
వక్రోచ్చనీచ స్వక్షేత్ర వరకేంద్రమూలత్రికోణే
త్రింశాంశషష్ఠ్యంశైరావతాంశ పారిజాతాంశ
గోపురాంశ రాజయోగ కారకం
రాజ్యప్రదం గురుగుహముదం ॥

**శుక్ర గ్రహార్పణమస్తు**

**॥ శివార్పణమస్తు ॥**